

# గ్రంథకర్త

జననము జనవరి 1918. తల్లి శేషమ్మ, తండ్రి నారాయణ. సామాన్యపురైతు కుటుంబము. సత్తెనపల్లి తాలూకా విప్పర్ల స్వగ్రామము.

ప్రాథమికాంధ్ర కావ్యపఠనము పితృపాదులకడ. సంస్కృత కావ్యపఠనము శ్రీమాన్ నరికొండ నమ్మాళ్ రాజులవద్ద. ఉన్నత విద్యాభ్యాసము పూజ్యపాదులు శ్రీదువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారివద్ద.

1936లో జిల్లాకిసాన్ కాంగ్రెసు సహాయకార్యదర్శి. సత్తెనపల్లి, మాచర్లఉన్నతపాఠశాలలలో తెలుగు పండితులు. ప్రస్తుతము పొన్నూరు శ్రీభావనారాయణ స్వామివారి సంస్కృత కళాశాలాంధ్రోపన్యాసకులు.

1953 జనవరిలో కవిరాజ బిరుదము. ఓగ[illegible]ైన పండితులు, చేయితిరిగిన కవులు.



# దివ్యస్మృతులు



కవిరాజు

కొండవీటి వేంకటకవి

పల్లకిఁ బట్టి మత్తకరిపై నిలఁబెట్టి మహా దుకూలముల్
కొల్లగఁ జుట్టి రత్నమయ కుడ్య విచిత్ర గృహమ్ము గట్టి భూ
పల్లభు లిచ్చి 'రీ డవలు బాడవులు' న్మను దానిఁ గోరమే
మల్లిన గద్యపద్యముల నాదృతి సేసినమేలు నేఁడగున్.

IV

# కృతి

భావోపేతము లైన రీతులఁ గవిబ్రహ్మల్ ప్రవర్షింప వి
ద్యావాసంబని పండితాగ్రణులు బ్రహ్మానందముం జెందఁగా
నేవేళం గొలువుండు పూజ్యతముఁ డెంతేఁ బ్రేమఁ జిర్ణవ్యపర్ణ
గావోయీ! కవిరాజయన్నఁ గృతిఁగానా! నేను ముమ్మాటికిన్.

కవులును జిత్రకారులును గాయకులుం దనివోంది నిత్యమున్
భవనమునందు నిల్చి తమ భావము లాకృతిఁ దెల్ప నందులో
నివి శుభమంచు నూత్నముల నేర్చి మదిన్మరిపించు మూర్తి నా
కవితకుఁ బట్ట ముట్టివడఁ గట్టితి ధన్యుఁడ సత్కవీంద్రులన్.

చిఱునవ్వుల్ గురియింప నైమఱచు శాస్త్రీయంపు వాగ్ధోరణిన్
బఱపింపన్ గరుపాటు మేను విబుధ ప్రారంభ సంరంభ సం
భర భావార్ద్రిత సార్ద్రితం గను గవివ్రాతమ్ము నీ సన్నిధిన్
గురుదేవా! యని వెన్కఁబట్టి జను లెన్నో రీతులం గొల్వరే.

మానవ తత్త్వముం జదువు మానిసి బానిస కాఁడు కాఁడు స్వ
స్థాన పరస్థలమ్ముల యథార్థతఁ దృష్టిజరించు సంఘు స
మ్మానములందు హేతు యుత మార్గమునం జరియించు సత్యముం
బూని సుఖించి మించు నని బోధయొనర్చుచు కూర్తు వెంతయున్.

తిన్నని మాటలోఁ జులుకు తీండ్రిలు చిత్రములోని భావముల్
సన్నని నూఁగు మీసల విలాసముఁ జూపు దరస్మితప్రభల్
పున్నమ వెన్నెలెన్ను పెదవుల్ గదళీదళ సామ్యముల్ మహా
భ్యున్నతిఁ దెల్పు నెన్నొసలు మూర్తియె చాటుగణాధిపత్యమున్.

కమ్మఁదనమ్ము కంఠమునె కాదు వచించెడి మాట మాటలో
గ్రమ్మను నానుపూర్వికము గాఁ గుదియింపు మదింపు లీ కవి
త్వమ్మునె కాదు డెందముల వర్తిలు నిట్టి పవిత్ర మూర్తి కా
వ్యమ్మను సంకితమ్ము గొను భాగ్యము భోగ్యము కాదె మాకిటన్.

కృతి కవిరాజు లేక సుకవీశ్వరుఁ డాకవిబ్రహ్మ కొల్లి స
త్కృతుల నొసంగి శాశ్వతలఁ దీర్పక పోవుట నన్నెఱింగి త
త్ప్రాతినిధి నాట నాసయిని భారము మోపిరి వారి కాంక్ష దీ
ర్చితి హితు నింతవానిఁ గయిసేసితి మామక కావ్య కన్యకన్.

ఎమరెవ్వారలు రాక రాఁదగిన వారీపట్టణాభ్యున్నతిన్
మదిఁ గాంక్షించెడి వారు మీరని ప్రశంస ల్సేసి యధ్యక్షతా
పదవి న్నిల్పఁ దెనాలి పౌరజన సభ్యవ్రాత మేల్మేలనన్
గొద లేకుండఁగ నావులాన్వయమణీ గోపాలకృష్ణాహ్వయా !

VI

# స్వీకృతి

కృతులకు స్వీకృతులు తెలుగు సాహిత్యమార్గాణంలో పూర్వ సంప్రదాయాలు. కృతిని కవికి కూతునిగా భావించి, స్వీకృతుని అల్లునిగా అమర్చి పూర్వులు కవి సమయాన్ని కుదిర్చారు.

మా కవిరాజు తన దివ్య స్మృతులను నా పేర అమర్చి, కావ్యాత్మలో అంగీకారం గలవాణ్ణి గనుక, అల్లరికం చేకూర్చి, పెద్దరికాన్ని చేపట్టాడు.

దివ్య స్మృతులు వ్యక్తి చిత్రణ కార్యం. వస్తువు-యుగ కర్తలు, మార్గ దర్శకులు, సంఘ నిర్మాతలు. కవిరాజు వస్తువును ఆకళింపుచేసుకొని, ఆ యా నిర్మాతల ఆనుపానులు యెరిగి, తరచి, రంగరించి కావ్య వస్తువులో క్రుమ్మరించాడు.

కవితకు రీతులు లేక గాసటబీసటగా వున్న రోజులు; అసలు కవిత్వమే పనికిరాదని వాదాలు. అందువల్ల కొత్తరీతులు చూపి, మార్గాన్వేషణచేసి, కవితకు అర్హస్థానాన్ని చేకూర్చే ప్రయత్నాలు సాగనారంభించినై.

దానికీ కృతి నాంది. అందుకే స్వీకృతి.

—గోపాలకృష్ణమూర్తి



కవిరాజు

కొంపపిటి వెంకటకవి

# ?

శ్రమపడి వృత్తికార్యము విరామ మెఱుంగక చేయువారి నీ
చముగఁ గనుంగొనంగ మది జంకక కొంకక యుండు చచ్చుపె
ద్దమలను భారతావనికి దాఁపురముం బొనరింప నీక స
క్రమముగ నాల్గునాళ్ళు బ్రతుకంగ స్వతంత్రత నిమ్ము దైవమా!

పుట్టినదాది పాపములఁ బోవుచు గిట్టెడు వేళ నిన్మదిం
బెట్టినఁ జాలు నంచు నవిశేషులు ప్రేలిరి దొంగభక్తులీ
ఘట్టములం బఠించి నరకంబను భీతిఁ దొలంగి కొంపలం
గుట్టగఁ గూల్చినార లిది కాదునొ కూడదొ తెల్పు దైవమా!

కొబ్బరికాయలుం బసిడి కొప్రిములు న్బహుమాన మీయ త
బ్బిబ్బయి యుబ్బి కోరికలఁ బిల్చి యొసంగెదవంచుఁ బల్కుచో
సిబ్బితినాటుభక్తులకు జెందదు దీనిరహస్య మేమిటో
సుబ్బఁగఁ జేయుమా! తెరువుఁ జూపుమయా! బ్రతుకంగ దైవమా!

జాతిద్వేషము మానసంబలమఁ బశ్చాత్తాప వాక్యాలతో
బ్రీతింగూర్చిరి దేశభక్తులు మహోపన్యాసముల్ చేసి నీ
హితంతుంగని యూరకుంటివి జగమ్మిట్లైనచో సాగునా
తాతయ్యా! మొగమోటమీఁడుము యథార్థంబైన వాక్రువ్వగన్.

రక్తాన్నమ్ము భుజింపఁగోరి యవతారం బెత్తితీవంచు మా
భక్తుల్చెప్పిరి, నిర్గుణంబగుఁ బరబ్రహ్మంబు సాకార మ
వ్యక్తుల్ గూర్చియె రూపులేదనుచు వేదాంతాగ్రిముల్ పల్కిర
వ్యక్తా! దే. ని నమ్మ దేని విడువ న్వచ్చున్ వచింపంగదే.

ముక్కును చక్కను కపువులు పంక్తియు మీసలు నల్లరాతిపైఁ
జెక్కి సమంత్రికం బుగ సజీవితుఁజేసి వసింపఁ గొంప నీ
కక్కరితిన్ సడల్పఁ గులకాంతను గూడును గుడ్డఁ గూర్చి రం
డొక్కటిమైయు స్తితచుల మానునె మానక తెల్పు దైవమా!

నాలుగు చేతులందుఁ బదునాలుగు బూతులఁ జొన్పియందులో
మేలును బుద్ధిమంతులయి మీరు గ్రహింపుఁ డటందు రట్టులే
పాల విసమ్ముఁ గూర్చి కడుపారఁగఁ గ్రోలుఁడు పాలమాత్రమే
క్షేమము నిడుఁడన్నఁ దమచే నగునా! యెఱిఁగింపు దైవమా!

పదవులకుం ధనార్జనకుఁ బాపప్రవృత్తికి లొంగి సిగ్గు దా
మొదఁ గదియింపఁ జోక నశియించె మతమ్ము కులమ్మటంచుఁ జె
ప్పెదరు ఇది సత్యమౌఁ గులమున్నెడనాడ రిటేమి పాపమీ
యుదపదపోడ హీనకుల మానె సమానముగా దయామయా!

మతమను పేరితో బ్రతుకు మానుషు లార్తిని బొర్చి హీనులై
బ్రతుకుఁడు వర్ణధర్మముల వంబును నిడకుండంచు మంచిగా
వెతఁగలిగించి తామనుభవించిరి సౌఖ్యములెల్ల మాకు స
ద్గతియిఁక లేదు లేదు వరదా! పరపీడితజాతి కావుమన్.

మోసపు వేసముల్ తలకు ముద్గిన దోసము లర్థహీనముల్
శాసనముల్ పరార్థగ విలాసము లాంతర ధర్మశూన్య వి
న్యాసము లన్యసంతతి వినాశవినాయక సూత్రిముగ్గదా
యోసరిలంగఁ జేసె మమునో మొనువారలు లేక దైవమా !

మొగమున బాహులందొడల మొల్చిన వారలసేవచేయు ని
జగతిని శూద్రులన్నయొక జాతిని సృష్టియొనర్చి మాల మా
దిగలను వారిఁ గొల్వఁగ విధించితి నీప్రజయిట్టి రొచ్చు లో
చ్చుగ బ్రతుకిచ్చగింపఁగను చో గుణకర్మ విభాగ మేమగున్.

నేఁడు మతానుశాసనము నీతికి జాతికి దూరమౌచు వా
యోడక కూయువారు కనరో! వినరో! మనుధర్మశాస్త్రసం
పీడిత హీనజాతుల సమిద్ధ చరిత్రుల నాఁడు లేని యీ
యేడుపు నేఁడు వచ్చి పడనేమన నెత్తిని దెల్పుదైవమా !

# వేమన

సురవగాహముగు నేకాంత భావముల సామాన్యులలోఁ బ్రచార మొనర్పఁ బ్రయత్నించుటయే కాక నాఁటి సంఘ దురాచారముల నిర్భయముగాఁ బ్రకటించినవాఁడు వేమన యోగి. తెలుఁగుదనము వెల్లివిరియ ననంత భావములు నలఁతి యలఁతి పదముల లఘువృత్తమున నిముడ్చువాఁడొక్క వేమనయే యన్న విప్రతిపత్తి యుండఁబోదు. గురు లఘు ప్రస్తారముల యతి ప్రాసలఁ గొంత స్వేచ్ఛనిచ్చి తాళ లయాన్వితమై దేశీయ వృత్తములగు—ఆటవెలఁది, తేటగీతి, సీస, ద్విపద, పద కవిత్వములు మాత్రమే తెలుఁగు సామెతల కామెతలు గూర్పఁజాలును. తాత్త్విక పరిశోధన మొనర్చి పరిశుద్ధుఁడై కులమతాచారములఁ గ్రుళ్ళిపోయిన సోదరాంధ్రులకెల్ల లోగుట్టు వెలువడునట్లు లాటవెలఁది తేటగీతులతోఁ దన భావమును వెల్లడించెను. ఆటవెలఁది తేటగీతులలో నీ మహావికాసముం జూపినవాఁడొండు లేఁడు. శివకవి యగు పాల్కురికి సోమన పిమ్మట వేమన తప్ప విశ్వశ్రేయముకై కవిత్వమింతగా నుపయోగించిన వాఁడాంధ్ర భాషా ప్రపంచమున నింకను బుట్టలేదు.

ఏ కవిశేఖరుండు రచియింపఁగఁజాలు నలంతి పల్కులన్
జేకొని మూఁడుపాదములచే నిగమార్థములం గుదింప నీ
పోకడ చెల్లెఁగాక గురుపుంగవ! సాంఘిక దాస్యవృత్తి య
డ్డాఁకయొనర్ప మొత్తితివిరా! ఋషివన్నను నీవ వేమనా!

వేమన పద్యరత్నములు వేయి విధమ్ముల నర్థమిచ్చు నం
దామతిఁ జేసి లోకము మహామహు లాగమశాస్త్రవేత్త లీ
భూమిని గాలువెట్టరను బుద్ధి జనింపదు స్వప్రకాశ సం
ధామముఁ జేరికొన్న గుణధాముఁడ వీవకదయ్య వేమనా!

ఒక్కొకమాటలో నిమిడి యున్నది దివ్యమరంద ధార చేఁ
జిక్కిన దాంధ్రవాఙ్మయ మిసీ యనిపించిన దైహికమ్ము నీ
పుక్కిటఁ జిందివచ్చినవి పూర్ణసుబోధలు తెల్గుజాతి యు
క్కెక్కిన దోయి నీవు జనియించిన మండలమాట వేమనా!

నీరచనల్ గ్రహించిన మనీషులు పశ్చిమదేశ వాసులే
తీరనియాశతో ననువదించిరి యాంగ్లమునందు భిన్నులా
వారలు వారివారి తలిబాసను దీఁచి దిద్దినార లీ
తీరున నే కవీంద్రుని గృతిం బొసఁగించిరి యోగివేమనా!

పుట్టితి రాజవంశమునఁ బూర్ణసుఖంబుల నందఁగోరి చే
పట్టితి సర్వభోగములఁ బ్రాక్చరమార్గపుఁ గర్మజాలముల్
రట్టడిపాలు చేసి తభిరాముని సద్గురు దీక్షఁగోడ నీ
పట్టినపట్టులో నచల భావము పూర్ణతఁజెందె వేమనా !

పై మెఱుఁగారఁగాఁ దమ స్వభావముఁ జూపెదరింతెకాని యీ
స్వాములు లౌకికమ్ము దులుపఁ సమకట్టిరె పూర్ణభావ గీ
తామృతపానమత్త హృదయుల్ దిగంబరులైరె యంచు మా
వేమనమూర్తి యోగియనె పేరగురుఁడొకరుఁడు వేమనా.

బలిసియుఁ దోఁకమట్టఁగఁబట్టి ఫణీంద్రుని భూనభోంతరం
బులు పగిలిశద్దమానఁ దమ ముత్తెలు కొమ్ములువంచి పొంగి పు
త్రులు వగులంగ లొంగక బరిం బెనఁగాఁడెడి యాల పోతులం
దలలను బట్టి "ఛే" యని చెదర్చిన నీధృతి నెంతు వేమనా !

మిముఁ గామింపఁగ వారకామినుల కూర్మింజిక్కి శీలమ్ము రా
జ్యము వంశాగత గౌరవాంకముల మచ్చాఁ కూర్చితే యంచు లో
కము వాకొన్నది యల్లిబిల్లి కథలం గల్పింప మూఢాళి స
త్యము సత్యంబనె నీ చరిత్రి తలకిందయ్యెన్ వృథామాధురిన్.

ఏయమ్మ చన్నిచ్చి జోయంచుఁ బాడెనో
పరిపూర్ణ భక్తి సంపదలు పొదల
ఏ తండ్రి ముద్దిడి యేమేమి చెప్పెనో
జ్ఞానాబ్ధి దరిచ్చి వెన్నను నొసంగ
ఏ గురుండెద మెచ్చి యిచ్చెనో యాబోధ
రక్తిఁ బూర్ణ వైరాగ్య ముదిరి
ఏ స్వామి మిము సృజియించెనో నానాఁడు
చేసుకొన్న సంస్కృతిబలాన

ఏ మహామహులు లానాఁడు తాముచేసి
కొనిన పుణ్యమ్మదేమొ నిన్నని పునర్భ
వమ్ము వమ్మగు నచల భవమ్ము గనిరి
ఆంధ్ర యోగీంద్రచంద్ర వేమన ఋషీంద్ర!

పరిపూర్ణానుభవమ్ములో సకల సంపద్రాజ్యభోగమ్ములం
బరిహరమ్మొనరించి యాత్మగతి సంప్రాప్తింప మోక్షైక రా
జ్యరమాంకంబున లాలలందితివి ధన్యంబయ్యె నాకైత నీ
చరితంబున్ రచియింపఁ గొమ్మివె నమస్కారంబులన్ వేమనా.

# వీరగురుఁడు

పాలకులు మహమ్మదీయులై పాలితులు హిందువులైనప్పుడు హైందవ మహమ్మదీయ సఖ్యముకొఱకు సిద్దప్ప మొదలగువారి శిష్యులుగాఁ జేకొని తన సమతా భావమును సుల్తానులకడఁ బ్రదర్శించెను. అస్పృశ్యతా దోషము వెత్తి తలలు వైచినపుడు నడుముగట్టి పంచముల సహపంక్తి భోజనమునఁ గూర్చుండఁ బెట్టుకొనెను. సమైక్యమునకు వేమన భరత వాక్యము బాడె వీరగురుఁడు నాంది వాక్యమునందుకొని యా యుద్యమమునకు మెఱుఁగులు దీర్చెను. దేశీయ వృత్తములలోఁ సిద్ధానిలోఁ జేరని - నందామయా గురుఁడ నందామయా! యను క్రొత్త వృత్తము నాలాపించి పామర లోకమును భావావేశ సుధాబ్ధిని నోలలాడించెను.

ఆకర్షణీయములగు వేష భాషలతో సంగీతస్వరములతో నాంధ్రదేశమున నింత ప్రచారమొనర్చిన గురువరుఁ డింకెవఁడు లేఁడు. అందువలననే వేమన యంతయోగి నాయంత గురుఁడు లేడని ఘంటాపథముగఁ జాటుకొనఁ గలిగెను.

నిలిచినచోటఁ బాటిలు వినిర్మల భావము, నీతిగూర్పఁగాఁ
దలఁచిన భావముల్ ప్రతిపదమ్మునఁ జిమ్మ, భవిష్యదర్థముల్
పలికిన పల్కులోనఁ గనుపట్టును ధన్యము ధన్యమయ్యె మా
తెలుఁగు పొలమ్ము వీరగురుదేవ! భవాదృశులేరి ధారణిన్

మతకర్తలెల్ల దుర్మానమ్ము హీనమ్ముఁ
బాటించి ద్వేషముల్ చాటునాఁడు

అంగనామణుల స్వేచ్ఛం గంగపాల్సేయు
మాతృవిద్రోహులు మసలునాఁడు

తలయెత్తలేని జాతులు విద్యయే లేక
మొఱకుందనమ్ములో మునుఁగునాఁడు

పరదాస్యభావ బంధుర విసీలాబ్దముల్
చెలరేఁగి చీఁకట్లఁ జిమ్మునాఁడు

సంఘసంస్కృతి, స్వేచ్ఛ, విజ్ఞాన, శోభ
లల్లుకొన మల్లెమొగ్గ పందిళ్లు వెట్టు
నీ మహాకార్యములు నిల్చురా! మహాత్మ
వీరగురువర్య! మా నమస్కారమార్య!

కులదేవతలకు గజ్జెలుగట్టి యాడించి
పాడించు చున్నంత పలుకునాఁడు

మతపిశాచములు మార్మసలి నెత్తురుద్రావి
తృప్తితో గట్టునఁ ద్రేఁపునాఁడు

ఆచారమను మారి యఱ్ఱెత్తి హెచ్చు త
గ్గులుగొల్పి ప్రాణాలఁ గొఱుకునాఁడు

కట్టుపాటులకు లొంగని కులమ్ములఁ బట్టి
యుద్రేకమునఁ దాఁట లొలుచు నాఁడు

దివ్యబోధల మాల దూదేకుల కిడి
యెల్లరకుఁ బంక్తిభోజనం జేరుపఱిచి
కులమతాచారములను హక్కులను దుల్చు
వీరగురువర్య ! మా నమస్కారమార్య !

గురులన మీఁర లోకమునకుం బరిశుద్ధతఁ గూర్చి దోషముల్
పెఱికి మహాపథమ్ము నవలీలను జేర్చితి రద్ది ధర్మమీ
గురువుల రామ రామ యనఁ గూడదు కాని సుఖాశ వేర్పడన్
జెఱచిరి శిష్యసంఘముల నేఁడ వినీతి పథావలంబులై.

సుకము దుఃఖమును జెందక యష్టతనువులు
విడిచి సంపూర్ణమై వెలయునాఁడు

బ్రహ్మవిద్యను బోధ పఱుప సిద్ధప్పఁడో
దేశదేశాలలోఁ దిరుగునాఁడు

కందిమల్లయనామక గ్రామమున మఠం
బును నిల్ప మీామది పొడమునాఁడు

సచ్ఛిష్యులకు భవిష్యత్కాల మర్మజ్ఞ
విజ్ఞానమహువు ద్రావించునాఁడు

గురులు శిష్యులు మిముఁ గూడి పరమ మంత్రి
పూర్ణబోధల నందునప్పుడు జనించి
చూచు భాగ్యమ్మునకు నేను నోఁచ నైతి
వీరగురువర్య! మా నమస్కార మార్య!

గురుతర నవ్య సంస్కృతులకుం దల బొప్పులుగట్టి సేవఁ జే
సిరి ముని వేమనార్యులు నశించె మతాంతర జాతిజాడ్యముల్
బిరుదు మగండవై యవన వీరులు దేశము నాక్రమించి మ
త్సరము వెఁగొప్ప నైక్యము ముదంబున గూర్చితి వీరసద్గురూ!

"రైతు కూలీ ప్రజారాజ్య" సేవకుడన్న
గరిమ రెడ్డ్యచ్చమ్మగారి సేవ

జాతివిభేద మత్సరశూన్యుఁ డన్నఁ బం
చము లిండ్లఁబోన బోనము మెసవుట

సర్వసమ్మత మత స్థాపకుండన నాఁటి
తౌరుష్క పూజా విధానములును

పనిసేయవచ్చు రాబకీయోడ బ్రిదుకన
దారుస్వర్ణకిరీయాదరణ గరిమ

సాక్ష్యములు గావె మానవ జాతికెల్ల
నవ్యదివ్య మహోజ్వ లానంద మార్గ
దర్శకుండవు నీ జీవితమ్మునందుఁ
గలదు మనిసంచయముఁ గూర్పఁ గలకయేని.

కాలజ్ఞానములల్లి యాలపయి దూఁకన్ సింగముందోలి మం
త్రాలంబిల్లలఁగూర్చి యంధులకు నేత్రాలిచ్చి పోతేరుకోఁ
గీలిం గైకొని నీళ్ళపైనడచి యగ్నిన్ మ్రింగి తీవంచు దు
శ్శీలుండెవ్వఁడో పొట్టకూటికయిసృష్టించెన్ వృథాగాథలన్.

కులముగగ్గోలెత్తి కుయ్యిడినను రజ
స్వలయైనకన్య వివాహమాడి

పనివడి నిర్బంధ పఱుపఁ బాల్పడు చట్ట
ముల మొత్తి క్రొత్త త్రోవలఁ జరించి

స్వకులాభిమాన వాసనల మ్రగ్గెడివారి
దౌర్భాగ్య గతికిఁ జిత్తమునఁగుంది

పాట్టుకై వేదాంతమునఁ జేరు తార్కికా
ధముల వాగ్రూప దర్పమును దెగడి

దైవ వికృతి స్వరూపముల్ దయ్యములయి
పేదకుత్తుక నొత్తురు పీల్చు వృత్తి
నడుమఁ బ్రయతించి లోక కల్యాణమునకు
సర్వశక్తుల నిడు తపశ్శాలివీవు.

ఆనాఁడె స్త్రీహృదయంబునందు స్వతంత్ర
భావాబ్ధి వీచికల్ పరువులిడియె

ఆనాఁడె సంఘ దురాచారము నెదిర్చి
కొమరిత కోర్కె పూజ్యము నొనర్చి

ఆనాఁడె పతి నిర్ణయపు స్వాచ్ఛ్యతలు భామి
నీ సంఘమందు నాందిని బఠించె

ఆనాఁడె కులజాడ్య మంతరింపంగ దీ
క్షాకంకణముల హస్తములఁ దాల్చి

రత్నమామలు నీదు భార్యా సుపుత్రి
సముదయము నాడె సంఘ సంస్కారులైరి
మారె మిముఁ జూచి మతజాతిమాధ్యమెల్ల
ఆచరణఁ బట్టి బ్రతుకు సిద్ధాంత మనని.

మెడత్రాడులే యురినిడు త్రాడులని పెండ్లి
పేరంటములకు నువ్విళ్ళుగొనక

గతియింప భర్త సంఘమున గౌరవమూడు
పురుష దౌష్ట్యమున కబ్బురముగొనక

పసుపు కుంకుమ దుల్పఁ బడెడి మూన్నాళ్ళ ము
త్తైదువ తనము డెందమునఁ గొనక

క్షణిక భోగముల కాసలు గొల్పు లౌకిక
పరిపూర్ణ భోగ సంపదలు గొనక

స్వసుఖములు వీడి భారతజాతి కెల్ల
శాశ్వత ఖ్యాతి నిడిన మా యీశ్వరమ్మ
స్త్రీజనోద్ధరణమ్ముఁ గాంక్షించు నాఁడు
పుట్టమైతిమి దేవ! పాపులము మేము.

# సిద్దప్ప

మహామ్మదీయులు మత ద్రోహియనియు హిందువులు మహామ్మదీయుఁ డనియు నెదిరింప గురుదయామృతము సత్యపు బలము రెండు నండగానుండ విపత్సముద్రము నీఁది తీరమును జేరి మహామ్మదీయ హైందవ సంఘములందు ధర్మమును నెల కొల్పెను. పలుగురాళ్ళపల్లె కరణమగు గోవిందామాత్యుఁడు నిత్యము పాదార్చనచేఁ దృప్తు నొనర్చ సర్వసమ్మత మత స్థాపన మొనర్చెను. నిష్కళంక మైన భక్తితో నిరుపమాన మైన యావేశ ముతో గురునకుఁ దగిన శిష్యుఁడని తెలుఁగు దేశమునఁ బేరందిన వాఁడు సిద్దప్ప. సిద్దప్పవంటి శిష్యుఁడు లేఁడని జగద్గురువగు బ్రహ్మముగారిచే మెప్పుల నందుకొనెను.

ఏదైవమ్ముల కేమి నోము లిడెనో యీ! నిన్నుఁగన్నమ్మ యా
"యాదంబీబి" మహానుభావు నిను ముద్దాడంగ మున్పొద్దులే
యే దానమ్ము లొనర్చె పూల్వులకు నే యే రీతి సేరి స
త్పాదాబ్జామృతధార గ్రోలెనదొ సిద్ధయ్యా నినుంగాంచఁగన్.

నిను నానాయని బుగ్గగిల్లి సొనరుల్నిండార "చీ" పొమ్మటం
చును నుయ్యాలఁ గదల్చి నిల్చి తన యచ్చుంగ్గుద్దినట్లున్న రూ
పును నేనేయని గర్వమూఁచి హృదయంబుం జేర్చి యోఁ తెంచు ప్రే
మను గన్నెప్పుడుఁగప్పు నీజనని సంభావింతు ప్రశాంతమున్.

ఆయుష్మంతులరైన మిమ్ములఁ గుమారా! యంచుఁ బ్రేమించు భా
గ్యాయత్తుండగు 'పీరుసాహెబు' ముదంబారం బిరాజన్మమం
దే యే ధ్యాన సమాధులన్ మునిఁగి యోగీంద్రాళి సేవించెనో
ధ్యేయన్యాయ పదావలంబన కృతార్థీభూతచేతమ్ముగో.

కపిలుని తల్లిదండ్రులకుఁ గల్గెను బోధ వినంగ బిడ్డచే
నిపుడిటు సిద్ధమూర్తి వచియింపఁగ వీనుల విందులయ్యె నా
కపురపు టక్కరమ్ములు జగానికు మీకును దంపతీత్వ మం
ది పుడమి యెవ్వరిట్టి సుకృతిం గని నారలు పీరుసాహెబూ!

ఒకవంక స్వకులోన్నతికి భంగకరమని
యుక్తిమి పైఁబడి పంక్తు గోలుకుచుండ

ఒకవైపు మతపువారికిని "గంగదైత్తి"
వెఁజాబులెల్ల గోడలకు నింప

ఒకయోర మిః ఉ సగ్ర కులాలు గుద్దెట్టిఁ
జేసి హైందవ మనుస్మృతిని విప్ప

ఒకట దూదేకు వానికిఁ బాద పూజలా
ఘని సివమెత్తి గర్జనము సలుప

కానిపోని వివాదాలఁ బూని లేని
జగడములు పెట్టుకొను చచ్చు సంఘమందు
కాలు నిల్పి జయమ్మందఁ గంకణమ్ముఁ
దాల్చె మా సిద్ధమూర్తి వేదాంత ధి.

హైందవ మహమ్మదీయ సిద్ధాంత చయము
వికృత వేషాలకోఁ బిలుపీకులాడు
నాఁడు మతకకులుడుపు నిర్ణయము కోఁడ
సేవఁ జేసినవాఁడు మా సిద్ధమూర్తి.

# వేంకమాంబ

సనాతన సంఘ దురాచారముల నెదిర్చిన వీరనారీమణి. వితంతువులు క్షురకర్మ నొనర్చుకొనవలెనని శంకర పీఠస్థులు మూర్ఖపుఁ బట్టుపట్టి నిట్టి నీచకృత్యములు మా తలఁపుల నణఁప లేవని నిరాఘాటముగాఁ జెప్పిన ధీరురాలు. వేదాంత బోధల దేశదేశములఁ బ్రచార మొనర్చి మానవ సమాజ మెల్లఁ దినఁ ద్రావఁ నంటు లేదని యెలుగెత్తిచాటిన సంఘసంస్కారిణి. పూర్వమహాకవుల కావ్యముల కెనయనఁదగు వేంకటాచల మాహాత్మ్యమను సద్గ్రంథమును భక్త్యావేశముతోఁ జిత్రించిన విదుషీమణి. స్వానుభవ సగణిని రాజయోగసారమను వేదాంత గ్రంథమును విరచించిన దేశి కవయిత్రి. శ్రీ జనోపయోగములై మూఢాచారములఁ దొలఁగించు పాటల నెన్నియేని కమ్మని కంఠమున గాన మొనర్చిన గాన కోకిల. భాగవతమునంతయు ద్విపదగా మలిచిన కవితా శిల్ప వేంకమాంబ.

తల బోడైనఁ దలంపు బోడి యగునా? తాతయ్యలీ వెఱ్ఱి యూ
హాలలో నిండిన చిత్తవృత్తులకు లోనై మున్ను మమ్మెల్ల తా
పుల బాధించిరి నేమి ప్రామిగోన నబ్బుం బిడ్డలం గన్న తం
డ్రుల కార్యంబిదె, బాలికామణుల గొంతుల్ ద్రెంచి చెండాడుటల్.

అని హృదయాలు హత్తుకొన నాటిన నీ మృదుసూక్తులే రుచిం
దనిసిరి పెద్దలెల్ల యిది ధర్మవిరుద్ధము సంఘజీవనం
బున కిది చావుదెబ్బయని బోడలు కూడి యుపన్యసించిరై
నను సరిగొన్న త్రోవఁ బయనం బొనరించితివమ్మ వేంకమా.

నారీమతల్లివై వి
ద్యారణ్యస్వామి పంచదశివలె గ్రంథం
బేరీతిఁ దత్త్వశాస్త్రా
ధారంబుగ నిల్పితమ్మ తరిగొండమ్మా!

బ్రతుకులు భారమైనవి పురాతన ధర్మనిబద్ధ శాసనం
బతుకుల బొంతయై సతుల ప్రాణములం బలినందు కాంతలోఁ
గుతుకల నుత్తరించి చవిగొన్నది రక్తము మాంసమంచు నీ
సతులకుఁ దెల్పి నీ విజయ శంఖము నూదితివమ్మ! వేంకమా!

వచియించితివి స్వానుభవ పూర్వకమ్ముగా
వేదాంత బోధల వీనులలర

రచియించితివి రమారమణు శ్రీ వేంకటే
శ్వరు చరిత్రమ్ము వైభవము మివుల

విహరించితివి మహాశిర స్సాకీమణు
లరుగు దేశాల సౌధాంతరముల

చింతించితివి తలచెడిన కన్యకల రూ
పముల నెల్లపుడు చిత్తమున మలిచి

బ్రహ్మవిద్యా విహార సద్భావములను
వర్గ భేదమ్ము లేని సర్వస్వతంత్ర
మార్గముం ద్రొక్కితివి నూత్న మతము నీది
వినతు లందుము తరిగొండ వేంకమాంబ.

ఆనాఁటి కానాఁటి కాయువు వీడు హైం
దవ బాలికలకుఁ బ్రాణములు వోసి
ప్రతి నిమేషమ్ము సేవలు పరు సాంఘికా
చారమ్ములను గాలఁ జమిరి వైచి
రోజురోజును నవరోధమ్ముఁ గల్పించు
మడిమట్ల సుడిగాడ్పు లడఁచి వైచి
అప్పటప్పటికి సంఘాదరమే లేని
హీనజాతుల పక్షమూని నిలిచి

సేవఁజేసెడి నీబోటి శీలవతిని
కనివిని యెఱుంగ మాంధ్రభూమిని నిజమ్ము
సగుణ నిర్గుణోపాస నాసక్తిఁ దవులు
భవ్యగుణపేటి వేంకమాంబావధూటి !

# మస్తానయ్య

వీ రేనాఁడు గుంటూరు వచ్చిరో యెవ్వ రెఱుంగరు. నేఁటికి జీవించియున్న వృద్ధులు వారి నెఱింగినవారు కలరు. తాత ముత్తాతలనుండి వీరిఁటు నుండిరని చెప్పుట కలదందురు. మానియై డాంబికములఁ జెంతఁ జేరనీక మమత వీడి ముముక్షు మార్గగామియైనట్లు జనశ్రుతి వీను మిగిలియున్నది. ప్రతి సంవత్సరము వీరు సమాధియైన చోటుఁ జేరి హైందవ మహమ్మదీయ క్రైస్తవ మతముల వారలెల్లరు భేదభావములేక వారి యాదర్శ జీవిత గాథలఁ జెప్పికొందురు

గురువులు శిష్య సంఘములకుం బహుధా వ్యథఁ జెందిచెంది కూ
ర్తురు తమ వాగ్విలాసములతో ధనధాన్యములెల్ల నంద మీ
రరిగెడి త్రోవ తాకికుఁ కందదు, చెందదు భక్తకోటి గుం
టూరు పురవాస మానుతులనుం గొను మాదర మేదురంబుగన్.

ఏ దేశమ్మున జన్మమందితివో నీ వేనాఁడు గుంటూరిలోఁ
బాదైనిల్చితో తల్లి దండ్రులెవరో 'బాబా' విచారింపఁగా
రానీ ప్రశ్నలకుం 'జవాబు' కలరాంధ్రక్ష్మా గీర్తి దేహాలతో
శ్రీ దైవాజిన సిద్ధమూర్తులు పవిత్రీభూతకాంతిచ్ఛటన్.

వచ్చిరాని తెలుఁగుబాస మాటాడిన
పూవుదేనె చింది పొరలుచుండు
నడువలేక నడచి యడుగిడు చోటెల్ల
ముక్తికాంత జన్మభూమి యగును.

మును సిద్ధప్పవో! శ్రీరసద్గురుఁడవో ముమ్మూర్తులైయున్న వే
మనవో? కాకిటు ముప్వురుంగలిసి యాంధ్రత్వమ్ము సత్పూతముం
బొనరింప న్సమకట్టి గుంటురు పురంబుం జేరితో యొక్కరూ
పునఁ గాకున్న కులాత్మశక్త్యచల సంపూర్ణత్వముల్గల్గునే.

 

కనువిప్పి చూచెనా ! కలదు మోక్షంబని
సాంసారికులు పూజ సలుపుచుండ

ఫలమొసంగినఁ దిన ఫలమబ్బునని నమ్మి
గుమికట్టి ప్రజలు నిన్గొలుచుచుండ

మాటాడ మరల జన్మము శూన్యమని తత్త్వ
విదులు వేవిధుల సేవింపుచుండ

వివరింప నేర్చు భవిష్యదర్థములంచుఁ
గాలజ్ఞు లెపుడు నిన్గాంచుచుండ

పరువు దీక్ష లేని బక్కదున్నను గట్టి
చినుఁగు చాఁపఁ గప్పికొనిన బండి
తోడఁ బయనమౌదు వాడవాడలకెల్ల
గరువ మింతలేని గురువ రేణ్యా!

మిము భక్తిం బ్రణుతించు వారిపయిఁ గూర్మిం జిల్కి వారిచ్చు తీర్థములం గ్రోలి ఫలమ్ములం దిని, యనాస్థం గాలముంబుచ్చు నేమము చేకొన్న మహర్షి శేఖర ! మహాంధ్ర ప్రాజ్ఞలోకాళి ధన్యము ధన్యంబవు వార్షికోత్సవము లన్నా! భక్తిఁ జేయుచున్.

ఒక యుపన్యాసమీయక తెల్గుదేశమ్ము
నుఱ్ఱూతలూఁపు ధన్యుండ వీవు

ఒక వేసమైన వేయక సర్వజనుల నా
కర్షించుకొన్నట్టి ఘనుఁడ వీవు

ఒక కులోన్నతికిఁ జెందక యెల్ల కులముల
పూజలందిన మహాత్ముఁడవు నీవు

ఒక గొప్పఁదనముఁ జూపక సర్వహృదయాలఁ
జూఱఁగొన్నట్టి పూజ్యుఁడవు నీవు

బొమికిలెండి పక్కవోలె బొడ్డున ముక్కు
నునిచి యుండరీతి యోగనిష్ఠ
నుందువనుచు మూఁడువందల సంవత్స
రములు బ్రతికి తనుచుఁ బ్రజ వచించు.

అరిషడ్వర్గమదమ్మును
బరిహారమొనర్చి నీచ భవరోగాబ్ధిం
దఱియించి జనన మరణము
లోరయని తావులకుఁ జేరితో! గురువర్యా!

మరణమునొంద హైందవ సమాజము మిమ్ము సమాధిచేసి గుం
టురు పురమందు నస్రశువులు నోడిక కట్ట మసీదు తీర్చి ది
ద్దిరి, యటనిల్చి నీ యచలదీక్షను సంస్కరణంబొనర్చి భే
దరహిత మార్గముం గని కృతార్థతఁగాంచిరి నాఁటి మానవుల్.

సమయజ్ఞుండగు కుక్కుటేశ్వరుఁడు పజ్జంజేరి మిమ్మెల్ల కా
లము సేవించి భజించెఁ డత్సుకృత కర్మంబేమి పూర్వార్జితా
ఘము ముష్కాటికి మూలమట్టముగ దగ్ధంబయ్యె మేమంత మా
త్రము మీ సేవకు నోము నోఁచుకొన లేదా ! తెల్పుమస్తానయా.

# అలరాజు

పలనాటి సీమను ప్రథమమునఁ జేపట్టినవాఁడు- అలుగు రాజు. వీనికి మువ్వురు భార్యలు గలరు. మొదటి భార్యకు నలగామరాజు. రెండవ భార్యకు నరసింగరాజు. మూఁడవ భార్యకు మలిదేవాదులు గలిగిరి. తరువాత రాజ్యాధిపతి నలగామఁడయ్యెను. తన యేకైక పుత్రిక రత్నాల పేరమ; మిక్కిలి గారాబముతో నల్లారు ముద్దుగాఁ బెంచి యలరాజున కిచ్చి వివాహ మొనర్చెను. మామ తరువాత రాజు గావలసి యుండియుఁ దాను ధర్మమని నమ్మిన దానికై సర్వస్వమును వీడి మలిదేవాదుల పక్షమూని రాయబారమునకై మామ కడకు వచ్చి విఫలమనోరథుఁడై యింటి కరుగు నపుడు మధ్యమార్గమునఁ గుట్రపన్ని చంపఁబడెను. అలరాజు తండ్రి యగు కొమ్మన పుత్రశోకమున గ్రుంగక ధర్మక్షయమునకై క్రుంగెను. ఈ చరితము కవిబ్రహ్మ శ్రీ ఏటుకూరి వేంకటనరసయ్యగారు ముప్పాతిక మువ్వీసము వీరభారతమని వ్రాయుచు ముగియక ముందే యాంధ్రుల దురదృష్టమునఁ బరమపదించిరి.

అలరాజా! భవదీయ స్వార్థరహిత త్యాగంబు వర్ణించి య
శ్రులురాల్చెం దెలుఁగమ్మ ధర్మయుత సంస్తుత్య ప్రభావోన్నతుల్
తెలుఁగుంబిడ్డలు వీరవర్యులు భవద్దివ్యాకృతింగాంచి పూ
జలు గావింతురుపో కవోష్ణ రుధిరజ్వాలావలీఘంబుగాన్.

మామ నలగామరాజు సమ్రాట్టు భార్య
వినుతగుణశీల రత్నాల పేరమాంబ
పల్లెనాడేలునట్టి భూపతివి ముందు
సర్వము న్విడితివి ధర్మశక్తి రక్తి.

బ్రహ్మనాయని లోన స్వార్థము రవంత
పొటమరించిన దధికార ముద్ర భద్ర
తా నిరూఢతఁ గాంచ యుద్ధము నొనర్చె
తగులదీమచ్చ నీ జీవితమ్ము నందు.

బాలచంద్రుని మరణ దుర్వార్త వినుచు
నిట్టనిలువున బ్రహ్మన్న పట్టి వీడె
నిన్నుఁ జంపినవార్త కొమ్మన్న వినియు
కత్తి చేపట్టిరా పొలికలని కేఁగ.

తను వాంఛం దనుజన్మ వాంఛలఁ బరిత్యాగమ్ముఁ గావించెఁ గొ
మ్మన, ద్రోణుంబలె పుత్రుఁ డీల్గిన రణ వ్యాపారమే మాని బ్ర
హ్మన, స్వార్థాన పరార్థముం గలిపి ధర్మం బంచు వాక్రుచ్చు పె
ద్దను జే యంచు నుతించె లోకము, యథార్థం బెంత కన్మోసెనో!

రోయఁడోకించుకేనిఁ దను లోకము నింద యొనర్పఁ బోవు నే
మోయని రాజ్యకాంక్ష మదినూని సహోదరు పుత్రి కంఠమున్
గోయఁగఁ బూని పాపమునకున్ వెఱఁగందఁడు నాగసాని య
న్యాయముతో నృసింగ నరనాథుఁడు నిర్వధియించు వేళలన్.

అదిగో! పేరమ మేడమెట్లు దిగి దుఃఖాంభోధి నిర్మగ్నయై
కదియ న్వేచను దెంచి తండ్రికి నమస్కారంబు గావించి నా
బ్రదు కీనాటికిఁ దెల్లవారినది బాబా! నీవు నీ తమ్ముఁడున్
దుదిదాఁక న్పలనాటి నేలుకొనుఁ డిందున్ శాశ్వతానందతన్.

అని దురపిల్లు నామె హృదయవ్యథ సంజనితాగ్నికీల గ
ప్పిన పలనాటిసీమ నరపుంగవు భర్మ మహాసనంబుఁ గా
ల్చిన యది భర్తృహీన సతి జీవిత మప్పుడె యర్థమై గుబు
లొంటను దరిలేని వేదనలకుం గురియైనది నాగమాంబయున్.

పతి గతియించు వార్త చెవిబడ్డదో లేదో మహాగ్నికీలలం
జితి యొనరించి భర్తృగత జీవిత మాంధ్ర సతీ మతల్లికిం
గతియని చెప్పిచూపె నలగాముని కూఁతురు, స్వర్గసీమలో
నతబుధవారమై ప్రణయ నౌకఁ బ్రయాణమొనర్చె నీ జతన్.

# కృష్ణదేవరాయలు

ఈతఁడు రాజకవి. కవిరాజు నన్నెచోడాదు లెందఱో రాజకవులు మున్ను తెలుఁగు మాగాణమున దివ్యబీజముల విత్తిరి. తత్ఫలాపేక్షకై బహుళ ప్రయాసము నందినవాఁడు రాయలు. పదునొకండవ శతాబ్దము నుండియుఁ దెలుఁగు కవిత్వము వచ్చినను మహాకవుల మనుకొనినను నితర కవు లెవ్వరనలేని "దేశ భాషలందుఁ దెలుఁగు లెస్స" యను నీ మాటను క్షత్రియ కవి యగుటచే సధైర్యముగ ధర్మ పక్షపాతియై చాటెను. ఖడ్గమును గంటమును రెండు చేతుల ధరించి రాజ్యమును గవితా సామ్రాజ్యమును నిష్కంటకముగఁ బరిపాలించిన మహావ్యక్తి రాయలు.

## వీరి రచనలు

1 మదాలస చరిత్ర
2 సత్యావధూ ప్రీణనము
3 సకలకథాసార సంగ్రహము
4 జ్ఞానచింతామణి
5 రసమంజరి
6 ఆముక్తమాల్యద

కవికోక గండపెండేరముఁ గానుకగా దయచేయునంత స
త్కవి విజయధ్వనుల్ దిశలు గ్రమ్మఁ బురమ్మునఁ బచ్చకర్పపుం
దివియల హారతుల్ గొని మనీషిణు లాదరవేదురస్థితిఁ
గవియఁగఁ గన్నులార జననాథ! కనుంగొని తృప్తినందితే.

దేశభాషలయందుఁ దెలుఁగు లెస్సనిమ్రోఁగె
దెసలెల్ల నిండి యాకసము వగుల

నలు వలంకుల మహాంధ్రత్వమ్ము తీండ్రించె
సరి లేక కోరమీసములు దువ్వి

ఆంధ్రవీరాళి రక్తాంభోధు లుప్పొంగె
జయజయధ్వనుల దిక్చక్రమూఁపి

నైరిసీర ప్రాణవాయువు ల్వడఁ బీల్చెఁ
గాలాహి సదృశమహా ఖడ్గధార

లాంధ్రదేవుని దివ్య పాదారవింద
వినతులే కాని పరుల సేవింపఁ బోని
స్వచ్ఛభూమాంధ్ర మెపుడైనఁ జూడఁగలమొ
పుడమి శ్రీకృష్ణరాయలు పుట్టకున్న.

పటుభావాన్విత శబ్దజాలములతోఁ బర్వెత్తు వాణీచల
త్కటకస్వాదు ఝుళంఝుళార్భటులు నృత్యప్రక్రియంజూప స
త్పటిమంబుంగనె విష్ణుచిత్తుని కథాప్రాగల్భ్య సంపత్తి యే
మిట గోరంతకొ అంత కన్పడని వాఙ్మీ! కృష్ణరాయాధిపా!

"యవన రాజ్యస్థాపనాచార్య" పదవి హైం
దవ తురుష్కులకు బాంధవము నెఱప

"అరి వీరభయద గండరగండ"పదము శౌ
ర్యజ్యోతి కొరపిడిరాయి గాఁగ

"రాజాధిరాజ దిగ్రాజ" లాంఛనములు
జగదేకపాలన ప్రగతిఁ దెలుప

దివ్యమా శ్రీకృష్ణదేవరాయాభిఖ్య
వైష్ణవ తత్త్వ సంపత్తిఁ బెంప

ఆంధ్రకర్ణాట యవన రాజ్యములునిండి
నీ యశోదుగ్ధ వాహినుల్ నిఖిలదిశల
నెల్లవిరిసెడినాఁడు జీవించియున్న
కవులు ధన్యులు ధన్యముల్ కావ్యములును.

ఎవని ఖడ్గాంచల మ్మొనలేని పచ్చిర
క్తముతోడ జయపత్రికల రచించె

ఎవనికంటము మహోన్నతి వార్ధినోలాసి
గ్రథియించి మించె సద్గ్రంథ పటలి

ఎవని మెచ్చిన శిల్పమిగురొత్తె ప్రాక్ప్రశ్చి
మ క్షమా శిల్ప సామ్రాజ్యమందు

ఎవని వైదగ్ధ్య వైభవ మహాశక్తికిఁ
గలగుండు వడియె నల్లడలు బెడిసి

ఎవని సౌహార్దమూర్తి సత్కవికదంబ
పోషణాశేష మగుచు సంపూజ్య మయ్యె
నతఁడు శ్రీకృష్ణదేవరాయలు తెనుంగ!
వాఙ్మనః కాయముల నిము నందనమ్ము.

రణభేరీ ధణధంధణార్భటికిఁ గర్ణాటాంధ్ర దేశాధి నా
థ నికాయం బరిగాపులై గొలువ విద్యారణ్య వాఃపూర శ
క్తిని నాశీఃప్రభలందు నీ విజయలక్ష్మీ పాదమంజీర రా
ణ్నినదంబుల్ శ్రుతిపర్వమై వరలుచుండెన్ నాఁటికిన్ నేఁటికిన్.

అష్టదిగ్గజ కవీంద్రాళి సద్భక్తి సే
వింపఁ గావించుఁ గవిత్వసభల

షట్ఛాస్త్రములఁ బ్రవేశము గల్గు సాహిత్య
నిధులతోఁ జేయుఁ బండితుల సభల

స్థపతిశేఖరుల నర్చనఁ జేసి యొనరించు
సృష్టి మూలానల్ప శిల్ప సభల

పాషాణములు జాలువాఱు వారిం గూడి
గీలించుచుండు సంగీత సభల

మిన్ను మన్నొకరీతిఁ గంపింప దిశలఁ
దాళములు మ్రైచు వీర భటాళితోడ
నిండు కొలువుండు జగనొబ్బగండ బిరుద
రాజితయశుండు శ్రీకృష్ణరాయ విభుఁడు.

తెలుఁగు కవీంద్రసంతతి హృదిం బరితాపము హెచ్చె వాఙ్మయ
ప్రళయము వచ్చెఁ జిత్రశాళ పైని విషాద మహాబ్ద పంక్తి వె
గ్గలమయి వర్షధార వడగండ్లు వెసంబడఁజొచ్చె రాగలు
బ్ధులకు విరాగమబ్బెఁ దమతోఁ గళలెల్లఁ గృశించె భూపతీ.

అకటా! యెంతకు లేరు దుష్టమతు లాహా! కృష్ణభూమీశు ది
వ్య కవిత్వం బలసానిపెద్దన కృతంబంచిట్టి నీలాప నిం
దకుఁ బాల్పేసి కృతఘ్నుతం దెలిపి రిద్దానం గొఱంతేమి గొ
ప్పకు గొప్పైనది యల్ల సానులు రచింపం జాలువారే నృపా!

# మూర్తి కవి

నిజభుజ పరాక్రమముచే దిక్కులనొత్తి విజయనగర సామ్రాజ్యమునునిల్పి యాంధ్రభోజుండగు శ్రీకృష్ణ దేవ రాయుల కల్లుండైన రామరాయుల కాస్థాన పండితుండై తత్సోదరులగు తిరుమల దేవరాయలకు వసుచరిత్రమును కృతినిచ్చెను. తిరుమలరాయల మేనల్లుండు నరసరాజునకుఁ గావ్యాలంకార సంగ్రహము నొసఁగెను. ప్రకృతిలో లీనమై జడపదార్థమును చైతన్యముగా మలచిన సిద్ధహస్తుఁడు. శ్లేషయం దీతని రీతులు సంస్కృతాంధ్ర వాఙ్మయములందింతకు మున్ను లేవన్న నతిశయోక్తి కాదేమో!

వృద్ధుడై ప్రత్యేకశ్లేష కావ్యము నొకదానిని వెలయింప సమకట్టి కలిదోషహారములగు హరిశ్చంద్ర నలచక్రవర్తుల కథలను గ్రహించెను. ఆలయమును గట్టించి రాముని బ్రతిష్ఠించి సుతుల కాపేరుల నిడుకొనెను. నియమశీలుండగుటచే దీర్ఘాయుష్మంతుండై యొప్పెను.

సమకాలీనులు– కారు సూర్యప్ప కవ్యాదులు– మత్సర గ్రస్తులగు నిటీకల వారు నీతిమాలిన వింతవింత కథల నల్లి తమ యీసును వెల్లడించుకొనిరి. ఆంధ్రభాషకుఁ దివ్యాందనము గూర్చిన యిమ్మహాకవిని గవులు గవులై నుతింపఁజాలకున్నారు. భాషాభావముల మూలముట్టుగఁ జేపట్టి పిల్లవసుచరిత్రలని తమ కావ్యములఁ జెప్పికొన్నవారుఁ గూడ కృతఘ్నులైరి. వారివంత యనం బనిలేదు. మున్ముందు యువకవులైన గుర్తించి యీ ఋణమును దీర్చుకొనఁ గోరుచున్నాము.

ఓ కవిసార్వభౌమ ! భవదుజ్జ్వల కావ్యరసస్రవంతి మా
ద్వీక మనోజ్ఞ వారి నినదీకృతమై స్రవియించె నందు సు
శ్లోకుల మానసాబ్జములు శోభిలెఁ బారక బంభరాళి నా
జూకు వెలార్చి క్రోలెఁ బువుసోనల మూర్తికవీంద్రచంద్రమా !

బాకా లూఁదెడి వారు ముందునడువం బై సేలుఁవల్గప్పి వి
ద్యాశంజాత్మికిఁ దాత తాతయని మోయఁగ సంఘమే యున్నచో
నీ కావ్యమ్ములె గౌరవార్హములు తండ్రీ ! నాఁడు నీ పైని జ్యే
ష్ఠాకారుణ్యముసోఁకె నేఁడయినఁ బూజాపుష్పముల్ పొందుమీ.

తా మిడు బిచ్చమే శతవధాన విధానము నేఁడు దాని నీ
భూమిని మాడభూషికుల పూజ్యుఁడు తిర్పతి వేంకన ల్కవి
గ్రామణు లూరనూర "పహారా"యిడఁ ద్రిప్పిరి వారిఁజూచి వి
ద్యా మహిమాన్వితుల్ శతవధానములం బొనరించిరాదృతిన్.

భావము వెంటనంటఁ బద భంగులు కాలికి గజ్జెగట్టి వి
ద్యావనమందు సత్కవి హృదంతర సీమలు రంగశాలలై
దేవి సరస్వతీ సతి నటించె భవత్కృతి వాక్చమత్కృతిన్ యా
సేవఫలమ్ము, కాని నిరసించిరి మందులు కొందఱీసునన్.

తలఁపక్లిష్టముగాఁగఁ గూర్తు రసవత్సాహిత్య సంగీత స
త్కళలం గూరిచి పద్యగద్యగత బంధశ్లేష చిత్రాది వృ
త్తులు నీరీతులు సాగు నాఁగక దిసంతుల్ గొట్టె సీగంట మాం
ధ్రుల నుజ్జూఁతల నూఁపుచున్ భువన విద్యోతమ్ముగా సత్కవీ!

వాణీ నూపుర మంజు శింజితము దిగ్వ్రాతమ్ము చుంబింపఁగా
రాణించెన్ వసురాజ దివ్యకథ, నర్సత్మ్మాతలేశాను వ
క్కాణించెన్ దనపేర శాస్త్రకృతలక్ష్యమ్మెల్ల, త్రైశంకవ
క్షోణీపాలుని గాథలో నలుకథం జోడించితే మేలనన్.

కాఁపు కవిత్వమన్న నుడి కర్ణము సోకినమాత్ర నెంత సం
తాపము సెందితో సుకవితా రసరాజ్య రమా విలాస దృ
గ్వ్యాపృత నవ్య దివ్య భవనాగ్ర విహార కవీంద్ర బృందముల్
పాపపుజాతి వాతఁబడి మ్రగ్గె సనాతన సంఘ దుష్కృతిన్.

ఇది నీ నాడులఁ ద్రెళ్లి క్రేళ్లుటికి బ్రాహ్మీదేవతా దివ్య హ
ర్మ్య దరీద్వార కవాట పాటన మొనర్పం జాలి తద్దేవి స
త్పద పంక్తి న్ననుగెంపు సొంపు లీడు రక్తజ్వాల మామేన బు
ద్బుదమై కొంతకుఁ గొంత సోకినదా లేదో మూర్తి కవ్యగ్రణీ!!

తిరుమలదేవరాయలు గృతిం గొని యల్లుఁ దనమ్ముతోడ భూ
వరుల సమక్షమందున భవత్పద పూజనొనర్పఁ గావ్య సుం
దరినిడి కూఁతునిచ్చిన వదాన్య శిరోమణి కృష్ణభూమి భృ
ద్వరునకు నుద్దియైన ఘనతం గయికొంటివి మామవై కవీ!

నవ రత్నాంచిత సింహపీఠిఁ గనక స్నానమ్ము లాడించి స
త్కవితా రీతులు రామరాయలు వినంగా నోఁచి బంగారు వ
స్తువులు న్సింహతలాటముల్ దొడిగి ప్రీతుం జేసె నాఁడట్టి గౌ
రవముం గాంచిన సత్కవీశ్వరుఁడ వాంధ్రక్షోణి విద్వన్మణీ!

తల్లిదండ్రుల భావ వృత్తముల మలిచి
మృదు మధుర రీతిగాఁ గొమరితలఁ బెనుచు
నెడల శుక్తిమతీ నది యెదఁద పొంగి
పారలి ప్రవహించె నీ కలమ్మునఁ గవీంద్ర!

హాలముం బట్టి స్వజీవనార్థముగ మాన్యక్షేత్రముల్దున్ని పం
టలు పండించిన కర్షకాగ్రణివి, గ్రంథశ్రేణి వల్లించియుం
గలముం బట్టి యనూనకావ్య రచనాకౌశల్యముం గల్గి మే
లౌ కావ్యముల్ పాడిన పండితాగ్రణివి, కేల్మోడ్పందుమా సత్కవీ!

ముక్కుతిమ్మనకవి పద్యమును గ్రహించి
వాడితివటంచు దుర్జాతి యాడిపోసె
కట్టుకథలెన్నొ నీకంటఁ గట్టినారు
ప్రతిభతో దాఁటితివి ప్రతిబంధకముల.

అమితామోద నవప్రసూనములఁ బాదాబ్జమ్ములందుంపఁ బ
ద్యములం గూరిచి తెచ్చినాఁడఁ గొనుమయ్యా! భక్తి నేనెత్తు పు
ష్పము లేపాటి వటంచుఁ గింక నదలింపం బోకుమీ! సాహితీ
ప్రమదామానసమాధురీ మహిత విద్వల్లోక చూడామణీ!

పరికల్పితసాన్నిధ్యము
వరశారద చేసికొన్న వంశంబని సు
స్థిరుఁడై రఘువంశంబున
మెరయింపఁడె కాళిదాసు మూర్తి కవీంద్రా!

శ్లేషకు మూలకం బయి విశేష చమత్కృతి గల్గు సత్కృతిన్
బోషణచేసి రామనృపభూషణ సద్బిరుదమ్ముఁ దాల్చి సం
తోషము గూర్చి సత్కవి నుతుల్ గొను నిన్ బొగడంగ లేని యీ
దోషము భాషదా? పరమ ధూర్తులదా? యని తెల్పుఁ గాలమే.

కారణ జన్ముఁడన్న నుడి కారియఁ బెట్టును "భూ"ను వింత వా
గ్ధోరణిలోఁ గథల్ మలిచి కూసెడి కూళలఁ గన్న గుండెలోఁ
బాఱవె యుక్కు-గుండులు సభాస్థలి నీ యవమాన భూతముల్
కోరలు నూరి నేఁటికిని గోలెముకల్ కొఱుకంగఁ జూచుఁబో.

# నాగార్జునుఁడు

అమరావతిలో బౌద్ధమతమునకు శాశ్వతపుఁ బునాదు లేర్పడిన పిమ్మట నచ్చోటునుండి దిగ్విదిక్కుల కా సిద్ధాంతము తెగఁ బ్రాఁకెను. అపుడే యచ్చోటునుండి నాగార్జునాచార్యుఁడు కృష్ణాతీరమును బరిపాలించు నిక్ష్వాకు వంశీయులగు శాంతి-సిరి యను రాణుల కీ మతధర్మముల బోధించి వారియండచే బౌద్ధ విశ్వవిద్యాలయమును స్థాపించి యందు శిల్పకళకుఁ బ్రధాన స్థానమిచ్చెను. చైనా జపాను మొదలగు వివిధదేశముల వార చ్చోటి కరుదెంచి విద్యలనభ్యసించిరి. నేఁటికిఁ దద్వంశీయులై తన్మతావలంబకులై విశ్వబ్రాహ్మణులు "నాగార్జున" యను గోత్రనామము గలిగియున్నారు. అయినవి నాలుగు కళలలో నితఁ డెఱుఁగనిది లేదు. ఇతనినుండియే బౌద్ధధర్మ మిఱుతెఱఁగులై మహాయాన హీనయానములైనవని చెప్పఁబడుచున్నవి.

కలవు మహాంధ్ర మండలికిఁ గన్నులపండువుఁ గూర్చు తెల్గు శి
ల్పుల విజయాంక దర్పణములో నవభారత బౌద్ధలక్ష్మి కాం
క్షలు చిగురింపఁ గన్గొని పకాపక నవ్వి చిరత్నరత్నవ
స్త్రుల ధరియించి సంతసముతో సుఖయించు దినమ్ము లత్తఱిన్.

అది నాగార్జున దివ్య శిల్పయుగ మన్నా! నాఁడు శిల్పేందిరా
భ్యుదయంబై సరిక్రొత్త దేశముల నుద్బోధించి మేల్కొల్పె ధ
ర్మ దయా హింసలు ముప్పిరిం గొనఁగఁ బ్రేమజ్యోతి వెల్గించె నం
దుదయమ్మైనఁదృణమ్ము శాంతియుతమైయుండుంగదాహాయిగా.

రాతిని నాతిఁ జేసెనని రామునిఁ గొల్తురు రాతి రాతిపై
నాతిని ధర్మచక్రము ననంత తపఃఫలమైన బుద్ధునిం
జేతము లొత్తగిల్లఁ దమ చేవ వెలార్చిన శిల్పిపూజకై
జోతల నెత్తరేల పరిశుద్ధ మనమ్ములతోడ నేఁటికిన్.

బౌద్ధము హైందవమ్ము తలపట్లగు నాఁడు విశుద్ధ బుద్ధితో
దిద్దిన రేఖలా యివి పదింబదిగాఁ గనుపట్టు ఘట్టముల్
బుద్ధికి గోచరింప మన పూర్వులు నుర్వర నిల్పినట్టి సం
శుద్ధ మయ స్వరూపములో చూడుము వీడుము మత్సరమ్ములన్.

గానసుందరి నిన్నుఁ గాంచి మోజులు వాఱి
పలికింపఁ బులకరింతలఁ జిగిర్చె

కావ్యసుందరి నిన్నుఁ గౌఁగిలింతకుఁ జేర్చి
యనుభవించిన దక్షుం డానుభూతి

శిల్పసుందరి నిన్నుఁ జేరి సద్వర్ణ రా
గముల గిల్గింత లగ్గలమయయ్యె

చిత్ర సుందరి నిన్ను జీవితేశ్వరుని గాఁ
గొని పొందె దిగ్వి దిక్కుల యశమ్ము

సారమే లేని సంసార సాగరమున
మునుఁగక మునీశ్వరుండవై తెనుఁగు నేల
నుద్ధరింపంగఁ గంకణ మ్మూని నడచు
దివ్యయోగివి నీవు సందియము లేదు.

మలిచిన మల్పులోఁ బనికిమాలిన రాలును జీవమూని కాం
తులు విరజిమ్మె శిల్పుల వినూతన భావ పరంపరల్ జగ
మ్ముల నెలుఁగెత్తి రాగమయముం బొనరించె నహింసమూర్తియై
యులి మొన నిల్చి పొల్చెను సమున్నతిఁగాంచెను లాఁతి సీమలన్.

రాగాలాపము లోలి రాలుపడ సీరై రాలు సంగీత వి
ద్యాగంధమ్మును దాము నందుకొన సప్త ధ్యానముల్ నేర్వ మీ
శ్రీగేహమ్మును జేరి సేవ యొనరించెన్ మూఁగలై మ్రోఁగఁగా
సాగెన్, సద్గురుఁ గొల్వఁగల్గవె యభీష్టమ్ముల్ మహాజృంభతన్.

# చిన్నయసూరి

ఆఱుశాస్త్రములయం దపార సాహిత్యము గడించి వంశ క్రమాగతమగు విశిష్టాద్వైత భాగమున విపులఁ బ్రవేశమును సంపాదించెను. పచ్చయప్ప కళాశాలలోఁ దెలుఁగుపండితులై తమ సాహిత్యమును బాలురకుఁ బంచిరి. వీరి శిష్యత్వమునకు నోఁచుకొనిన యానాఁటివారు ధన్యులు.

జాతి మత భేదములలోఁ నాంధ్రుల దగ్రతాంబూల మగుటచే వీరి రచనలన్నియు ముద్రణ కాలేదు. ఇది దుస్సహము. పైగా సిగ్గుచేటు – తమవలెఁ బరుల నర్థము చేసికొను పండితులు చిన్నయసూరి యను పదమున కేవేవో యర్థములఁ జెప్పిరి.

మహోదారులగు శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు, దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు సత్యమును వెల్లడించిరి. వీరి ఋణ మాంధ్రులకుఁ దీర్ప నలవిగాదు. బ్రౌను దొరగారు సూరి యను బిరుదమిచ్చి యా పవిత్రనామమును దమ దేశమునందలి శిల్పులచేఁ దయారుచేయించిన గండపెండెరముపైనిడి కాలికిఁ దొడఁగెను. గుణపక్షపాతియగుటచే విదేశీయుఁడైనను గౌరవించెను.

నా యీ పద్యముల కాధారము శ్రీ పండిత కొత్త సత్యనారాయణ చౌదరిగారిచే రచింపఁబడిన చిన్నయ యను గద్యగ్రంథము.

కార్యాకార్య విచార శీలుఁడగు వేంకట్రంగరామానుజా
చార్యుం డాదృతి శ్రీనివాసమను యోషారత్నముం బత్నిగా
నార్యుల్మెచ్చఁ బరిగ్రహించె సువిద్యా శీల వాగ్ధుర్య సౌం
దర్యాదార్య యటన్న మేలిపలుకంటం దిగ్విదిగ్వ్రాతముల్.

ద్రవిడ వేద ప్రబంధంబు లుద్గీతింప
నధ్యాపక స్థానమందు నిలిచె

మంత్ర మంత్రార్థ ధర్మములు వెల్లడిచేసి
కావించెఁ బంచ సంస్కారములను

సంస్కృత ప్రాకృతాచ్ఛ ద్రావిడాంధ్ర భా
షల గురుండయ్యె సంస్తవము నంది

శేముషీ ఘనుఁడు లక్ష్మీనృసింహులు సెట్టి
శోధుగా నున్న శోద్యోగియయ్యె

సమముగా జాతులెల్ల మోక్షము గమింప
మార్గముం జూపె నపరరామానుజన్మఁ
డితఁ డటంచును జనులు సంస్తుతియొనర్ప
నలరె వేంకట రంగరామానుజండు.

తుష్టిం బుష్టిని గూర్చు కూఁతును నొకర్తుం గాంచి వైధవ్యమై
నష్టిం గాంచిన దాది లోకము మహాంధ ప్రాయమై శోఁచె నా
శిష్టాచారుల శోకవారిఁ నులు ముంచెన్ బుత్రకామేష్టితో
నిష్టైశ్వర్యములంద దంపతులు లక్ష్మీశాత్త చిత్తాబ్జులై.

శావించి రఖిల యజ్ఞద్రవ్యములు దెచ్చి
పూర్ణాహుతుల సామమును బఠించి

సేవించి రజ్జ గర్భావాస దేవేశ
ముఖ గణమ్ముల కర్ఘ్యములు ఘటించి

భావించి రాను పూర్వ్యముగఁ దద్వంశాధి
నాయ కాగ్రణులకుఁ దోయిలించి

పూజించి రధ్వరమ్మున నిల్చు యాయజూ
కుల కనర్ఘాంబరావళు లొసంగి

నీతి దప్పక పరుల మోఁచేతి నీరు
ద్రావక గడించు ధనమర్థితతికి నిడిరి
శక్తి పొలివోని దశరథేశ్వరు లటంచుఁ
బ్రజలు జయవెట్ట యజ్ఞ నిర్వహణ మందు.

మోసము లాలకించి ముని ముఖ్యుల జాతినెపమ్ము గోడఁ గం
ఠా సవమానఁ బోఁడు తనయూరిని జీటికిమాటికిన్ రసా
భాస మొనర్పఁ బోఁడు పరవస్తువు దానగుట్టి దోసముల్
పీసము లేక చిన్నయ భువిం జనయించెను స్వప్రకాశుఁడై.

నన్నయ తిక్కనాది కవినాథుల మార్గములం గమించి తె
ల్గన్నల పున్నెపుంగనులుగా వచనంబున దిద్దితీర్చి తో
యన్న! మహాంధ్ర కావ్యము లహర్నిశముం గవితాసమాధిలోఁ
బన్నిన భావబంధు రసబంధములా! పరవస్తుచిన్నయా!

అవి యివి యన్ని సాధువగు నన్నపథంబును వీడి శాస్త్రగౌ
రవమును నిల్పఁ బెద్దలు పరాకున నొక్కటఁ దప్పుదారి వె
న్దవిలిన వానినన్నిటి ననాదరణీయ మటంచుఁ ద్రోసి నీ
యవికృత సత్వముం దెలియునట్టు లొనర్చితివయ్య చిన్నయా!

ఇరువదినాల్గు గ్రంథము లహీనతరంబుగ వ్రాసి యాంధ్ర సుం
దరికి నమూల్య రత్నమయ ధామము లూర్జితశక్తిఁ గూర్చి నీ
యొరవడిలో మహాంధ్రయువయూథము నిల్చితి వీయుపజ్ఞకై
కరములు మోడ్చెరా! తెలుఁగుఖండమఖండ కవిత్వదీక్షకై.

గండరగండఁడుం గవి నికాయసమర్చితుఁ డాంధ్రవాఙ్మయో
ద్దండుఁడు శాస్త్రవాద పరిధావన శాబ్దిక తత్త్వ సార్వ భౌ
ముండు కళాప్రపూర్ణుఁడు సముజ్జ్వల భావుఁడు జాతి భేద శూ
న్యుండగు వజ్ఝలాన్వయుఁ డహో నిలఁబెట్టె భవద్యశమ్ము, వా
క్శౌండుఁడు పూరుషాకృతిని గన్న సరస్వతి యాంధ్ర భారతీ
భాండ విశారదుండు పరవాద భయంకరుఁ డాత్మ తత్త్వ వే
ద్యుండు దయార్ద్ర చిత్తుఁడు యథోచిత వాక్పరిపోషితాచ్ఛ భా
వుండు మహేశ నామ జప పూత విశుద్ధ చరిత్రుఁ డార్య ధ
ర్ముండు నవీన శాబ్దిక నభోమణి హా గను శాసనుండు వాః
కాండ విదారితారి జన కల్పితవాదుఁడు మద్గురుండు స
న్మండలమండితుండు గుణమాన్యుఁడు దువ్వూరివంశసింధు చం
ద్రుండు బుభుక్షితమ్ముల బుధ ద్దలబాఁపి సబాసనంగ వా
క్ఛండిమతో నడంచెఁ గవి కల్లురి యల్లరి యంత నాంధ్ర భూ
ఖండము మంచి కప్పురముఁ గైకొని హారతులిచ్చె దుర్విద
గ్ధుండు గులాభిమానియగు దోషికి బుద్ధి చలించె దుర్విలా
పుండగుటంత నోరు పడిపోయెను దుష్కృత మప్పుడప్పుడే
పండెను గర్మబద్ధుఁడయి పాప పరీవృత ఘోరపంక మ
గ్నుండయి కుండె, నీచుఁ దినఁ గోలెముకం గొఱుకంగ నక్కయా
దండకు వచ్చి రోఁతఁగనదా ! పరవస్తుకులాబ్ధిచంద్ర నీ
వుండుదువోయి తెల్గులనొకొండు వసించినదాఁక నుర్వరన్.

ప్రాఁతవడ్డ పురాణ పథము వీడక మోఁత
బరువుగా గ్రంథముల్ వ్రాయునాఁడు

అల్లిబిల్లిగఁ గథలల్లియుం బాడు వా
రిని సమర్థించి వర్థిల్లునాఁడు

కుల మత భేద వాదులకు దోహదమిచ్చు
మతకావ్యములు మూరు మసలునాఁడు

కోర్కె తీర్పనిదానిఁ గూర్చి యఱ్ఱులు సాఁచి
వచ్చిశృంగారంబు పలుకునాఁడు

యతుల దిగనాడి ప్రాసల నతకరించి
వెట్టి మొట్టి కవిత్వమ్ము వెలయునాఁడు
జననమందవు పరమపావనుఁడ వీవు
చిన్నయా ! నీ యదృష్టమ్ము చెప్పఁదరమె.

పాణిని సూత్రపఙ్క్తికి పవాదముగల్గినఁ గల్గుఁగాక నీ
వోణిమియందుఁ దప్పుఁ గనఁబోము కుదించి రచించుపట్ల గీ
ర్వాణము సౌకుమార్యమని వాదముచేసెడి వారికింత వి
జ్ఞానముఁగూర్చి తాంధ్రకవి సంఘముమేలని మెచ్చెఁ జిన్నయా!

అనవద్యశేముషీ ఘనుఁడ వీవనుటకుఁ
గృతకృత్యుఁడౌ హయగ్రీవశాస్త్రి

సాహిత్య సౌహిత్య సరణిలో నెనలేమి
న్యాయాధిపతి రంగనాథశాస్త్రి

వాదోపవాద విద్వద్గోష్ఠి సరిరామి
వీరవేంకటగిరి విభువరుండు

సువిశేష చారిత్ర శోభి వీవనుటకు
యాయజూకాన్వవాయజుఁడ వగుట

సంస్కృత ప్రాకృతాంధ్రాంగ్ల శబ్ద సార్వ
భౌముఁ డన హూణ విభుదత్త భర్మకంక
ణమ్మునంగల సూరిపదమ్ము మాకు
సాక్ష్యమగుఁగాదె వీరవైష్ణవకుమార !

కలరేమో మును పాణినీయ ముఖవర్గంబింత నీజోడుగా
కలరేమో మును తిక్కనాదులు సమగ్రంబైన యుజ్జీలుగా
కలరేమో కవిరాజులన్యనృప సత్కారమ్ములో నీడుగా
కలలోవార్త భవత్సదృక్షులకు నీ గారం బపారంబురా!

అయ్యలు కంఠదఘ్నమగు నార్తిని క్రుంగుడు చెంది యీర్ష్యతో
దుయ్యఁగఁ బట్టినం దమకు దోసమటంచుఁ దలంపరేరు చి
న్నయ్య! మహాంధ్ర కావ్యరచనా పరిణద్ధుఁడవైన నీకు దీ
టెయ్యది యంచుఁ దెల్పఁ దరమే! మముబోంట్లకు నీశతాబ్దికిన్!

గురునకుఁ బంగనామములు గూర్చెడి శిష్యులు జాతిభేద మ
త్సరులు యథార్థముం బలుక జంకెడు భీరువు లాత్మధర్మ మే
మఱి చరియించు శుంఠలు ప్రమాదముఁగూర్చెడియల్పసత్త్వు లిం
దఱు దఱుమ న్నిలంబడిన ధన్యుఁడవీవ కదయ్య చిన్నయా!

వీఁపున రాచపుండు పృథివీపతికిం జనియింప నద్దియే
మాపును రూపునన్న నుడి మాత్రము వింటిమి, సార్థకాఖ్యచేఁ
బాపపుఁబుండు నిన్నడఁచెఁ బండితరాజ! మహాంధ్రభారతీ
రూపము దుర్విమర్శక శిరోమణులార్చిరి నీవు లేమిచే.

జీవిత రేఖకు నూతన
జీవనముం గూర్చి బ్రతుకఁ జెల్లించిన వి
ద్యావేత్తవు చిన్నయ్యా!
రావయ్యా! భక్తింగోఁ గరమ్ములు మోడ్తున్.

# వీరేశలింగము

గద్య తిక్కన – రావుబహద్దరు – అను బిరుదముల నందియాంధ్ర సాహిత్యమున వివిధ రీతులఁ బరిశ్రమ మొనర్చిరి. ఆంధ్ర కవుల జీవిత చరిత్రమును దమవఱకున్న కవుల నెల్లర వారి జీవితముల సమగ్రముగ వ్రాసిరి. ఈ మహత్తర కార్యమే గాక- ప్రహసనములు- నాటకములు- పద్యకావ్యములు- వచనకావ్యములు- శాస్త్ర విచారణ గ్రంథములు- ఉపన్యాసములు- భాషాంతరీకరణములు- శుద్ధాంధ్ర గ్రంథములు- రచించిరి. ఇవి యవి యననేల భాషావిషయమున వారు పోని పోకడలు లేవు.

సంఘ సంస్కరణోద్యమమునఁ గాలిడి యుపన్యాసముల మాత్ర మిచ్చి తనియు నాయకమ్మన్యులలోఁ గొందఱి వలెఁ గాక తన సిద్ధాంతము నక్షరాల పాటించు దిట్టయని పేరెన్నికఁ గన్నవాఁడు. స్త్రీ పునర్వివాహాదిక సంస్కరణముల కితఁడు తండ్రి. సమకాలీనులచే వల్లమాలిన బాధలనందినవాఁడు.

ప్రాచీనాంధ్ర వాఙ్మయమునకు నన్నయ మార్గదర్శకుఁడెట్లో నవ్యాంధ్ర వాఙ్మయమునకు వీరేశలింగ మట్టివాఁడే యనవచ్చును.

ఆది మతకర్త లిడిన పునాది మీఁద
మలప సన్న్యాసి కట్టిన మాయ మేడ
నీ మహోజ్జ్వల విప్లవాగ్నికిని గూలెఁ
జిటిలి పోదు పునాది యిప్పటికిఁ గూడ.

జన సంఘమ్మున మూఢ భావముల నాశం బందఁగాఁ జేయ లే
ఖినిఁ జేపట్టితి వాంధ్ర వాఙ్మయము రక్షింపంగ నెక్కె నీ కేల, సాం
త్వన వాక్యంబులఁ జేరఁ జీరితి వనాథ స్త్రీల నీ సేవఁ గై
కొనె నాంధ్రావని నిన్నుఁ బోలఁగల దక్షుండేఁడీ ముమ్మాటికిన్.

పురుషుల పజ్జఁ జేరి పువుబోణులు పేనుసెమర్ప నాట సం
బరమును జూప నీవది యమానుష మంచుఁ దలంచి దైవ మం
దిరములఁ బెండ్లి పందిరుల నీతికి దూరగులైన ద్రవ్య పా
లుర నవ సౌధరాజములలో నెదిరించితివయ్య ధీరతన్.

భాషా భేషజ వాది వాదములఁ దూర్పారించి విజ్ఞానముం
బోషింపన్సమకట్టి సర్వజన సమ్మోదార్హ మార్గాంతరా
న్వేషంబుం బొనరించి పల్కులను వెలందిం దిద్ది గ్రామీణహా
వేషంబుం ధరియింపఁ జేసితివి శ్రీ వీరేశలింగాభిధా.

తెనుఁగున గద్యవాఙ్మయముఁ దీరిచి దిద్దిన మిమ్ము గద్య తి
క్కనయని "రావ్ బహద్దర"ని గౌరవచిహ్నములిచ్చి మెచ్చి పూ
జనమొనరించె లోకము దిశల్ వెలయించిన నీయశోమృతం
బునఁ బునరుద్భవించిరి ప్రపూతచరిత్రకు లాంధ్రసత్కవుల్.

గుడులుం గోపురముల్ సృజించుకొని లగ్గుంగూర్చికొన్నట్టి మా
గొడవల్ ద్రవ్వఁగనేల మీకని "హలంకోరుల్" దురుక్త్యార్భటిం
బడి కాల్దాఁచఁగ దైవమొక్కఁడని తెల్పంబూని బ్రహ్మంబు నే
ర్పడ వాక్రుచ్చితి కందుకూరికులచంద్రా! జోతలర్పించెదన్.

కులగోత్రమ్ముల జోలిమాలి వెలిగ్గోలొందఁ గాఁజేయు రో
జులలో నీ మహితోద్యమమ్ముఁ గనుగొంచుం జాలిఁజాలించి యా
శలతో నిండిన జీవితాలఁ బయనించం జొచ్చి రానాఁటి య
క్కలకంఠుల్ దమ భావిజీవిత మహాకార్యక్రమ ప్రక్రియన్.

జ్ఞానహీనుల కఠిన హుంకారములకు
నదరి బెదరి విభీతమృగాక్షులైరి
రమణులానాఁడు నేఁడు ధైర్యమువహించి
తమ సుధారస వాక్యౌషధముల మనిరి.

తరుణీసంఘము లప్పావడ్డవి మహాత్మా! మీ ఋణమిమ్మాఁగ బంగరుపూలం గొని వాఙ్మనఃక్రియల కేకత్వంబు సంధించి మీ పరిపూతాత్మకు నిత్యసేవలిడ మాభాగ్యంబు లుప్పొంగ నక్షరమాల గ్గళమందునింపెదము స్వీకారంబు గావింపవే.

కాలఁతఁబెట్టిరి సాంఘికబ్రువోద్దండులు
పాడిచేదమనియె దుర్బుద్ధిగణము

వెలి గిలి రేఁపి వాడలఁ జాటి రాయ్యలు
నాస్తికుండనియె ఛాందసుల మంద

కులద్రోహియని పంక్తి గొట్టెను నైష్కర్మ్మి
మును మోపియనె సనాతనుఁడొకండు

దౌర్భాగ్యుఁడని తిట్టెఁ దలకాయ శంతులు
చపలుఁ డంచనిరి లంచాల దొరలు

వాడ వాడలలోన బోరాడు నాఁడు
సత్యమెదనిల్పి సంఘ దౌర్జన్య మణపఁ
గంకణముఁ దాల్చితివి నమస్కార శతము
లివిగో శ్రీ కందుకూరి వీరేశలింగ.

# అప్పారావు

భాషావిషయమున విశేషశ్రమ లేకున్నను వాడినపాటి పామరహృదయముల నాటుకొను నట్లొనర్చిన వారిలో నగ్రేసరుఁడనుట కెట్టి సంశయ మెవ్వరికుండదు. ఆనందగజపతి సంస్థానకవియై యాంగ్లాంధ్రాది భాషలయందుఁ బ్రజ్ఞనార్జించిన వాఁడు.

గిడుగు రామమూర్తి పంతులుగారు మొదలిడిన వ్యావహారిక భాషావాదము నంగీకరించి తదనుసరణముగా గేయగద్య పద్యనాటకాదుల రచించెను. సమిష్టి క్షేమమునకై, సంఘ సంస్కారమునకై సర్వశక్తుల నుపయోగించిన వారగుటచే నాంధ్రయువతతి గౌరవించెను.

ఇట్టి కవి విరచితమైన గ్రంథములపై నిపుడు లేచిన దుమార మంతింతగాదు. ఈ దుస్థితి కగ్గమైన కవులు పూర్వులు గూడ గలరు. నన్నయభట్టు కంకంటి పాపరాజాదు లీకోవకుఁ జెందినవారే.

"దేశమంటే మట్టిగాదని
దేశమంటే మనుజుల"ని సం
దేశమిచ్చియు పీడితప్రజ
లాశలకుఁ బందిళ్ళు వెట్టిన

కవివతంసుని గానమాధురిఁ
ద్రావరా! దోషముపోవురా!

మూఁడుకోట్ల మహాంధ్రజాతికి
నాడులుడుకఁగఁ బాటపాడిన
వాఁడు మా గురజాడ కవియని
పాడరా బ్రహ్మాండభాండము

లూడి ఉకలుకలై గతుల్చెడ
నాడరా! కష్టములూడురా!

నరనరమ్ముల నమిలి మింగెడి
దొరలదాస్యపు మారి కోరల
విఱుగదన్నెడి కవిత లల్లిన
బిరుదు మగఁడని "రైతుకూలీ"



చిరయశమ్ములఁ గోరువాఁడని
వేయరా! ఢంకా వేయరా!

కట్టుపాట్లకు లొంగి యెట్టులొ
లొట్టకట్టు పదాలఁ గొన్నిఁటఁ
బట్టుమని పదికూర్చినంతనె
యట్టిదెప్పుడు కవితగాదని

గట్టిగా వాదించు కవియని
పట్టరా! దివిటీ పట్టరా!

అదరు బెదరును లేని సోనల
నెదలు పదునై శౌర్యబీజము
లదికి విప్లవ సస్యసంపద
యిది సుమాయని మనకుఁజూపిన

సదమలాత్ముని సత్కవీంద్రుని
గొల్వరా! సీనై నిల్వరా!

తెలుఁగుశౌర్యము తెలుఁగుదీధితి
వెలికిఁ జిమ్మెడి కోరమీసపు



మెలికలోఁ గనుపట్టు పూర్ణత
కలము కుంచెనుబట్టి త్రిప్పెడి

కళల వారికి సందరాతని
చెప్పరా! గొప్పకు గొప్పరా!

శివజటాంత ర్నదిత లహరీ
నివహముంబలె కాంతులీనఁగ
ధవళమౌ తలపాగ ముడుతలు
చవులు మివులు మహాంధ్రభాషా

కవనధారలఁ గప్పెనేమో
చూడరా! భావము వాడరా!

కులమతమ్ముల వెలికిఁద్రోసెడి
చిలకమర్తిని గలిసి మెలసియు
కలముతో స్వాతంత్ర్యమ్ముఁ దఱిఁగిన
సలలితాత్మని యప్పరాయని

తలఁపులకు నీ విజయశంఖము
నూఁదరా! సత్యవిసోదరా!

# రామస్వామి చౌదరి

తరతరములనుండి పౌరాణిక ధర్మము లాంధ్రుల తలపై రుద్దబడి నిస్సన్న చెప్పినదే వేదమని నమ్మవలసినదే కాని ప్రశ్నింపకుఁడని యదుపులోఁ బెట్టిన పెద్దల యుద్దేశముల కెదు రీఁది మంచిచెడ్డల నాలోచించుకొను హక్కు సర్వమానవులకుఁ గలదని చాటిచెప్పినవారు శ్రీ రామస్వామిగారు.

ఔత్తరాహుల పెత్తనము నెత్తిపైకెక్కి చాలుమాల లేని బూటకపు న్యాయాలతో నింకను గాలము వెళ్ళఁబుచ్చుచుఁ దమ కుహోన్నతి నిల్పుకొను రచనల సాగించు వర్తమాన కవులఁగూర్చి వాకొక బాకుగా ననవరతము పోరుసల్పిన ధీరోదాత్తుఁడు మహాకవి కవిరాజు త్రిపురనేని యొక్కఁడేయన్న నతిశయోక్తి యేమాత్రము కాదు.

పలికిన పలుకు, వ్రాసిన వ్రాత, యూహించిన యూహ సర్వము పతిత మానవ జనోద్ధరణకే యుపయోగించిన దిట్ట. మనోవాక్కాయ కర్మల మలిన మిసుమంతలేని పవిత్రజీవి. సూతపురాణము, భగవద్గీత, ఖూనీ, ధూర్తమానవా! సూతాశ్రమగీతాలు, శంబుకవధ, కురుక్షేత్రము మున్నగు వీరి రచనలు ప్రత్యేకాశయములకై యుద్భవించినవి.

కవిరాజా! యెదురీత యీఁదినది నీ గంటమ్ము సూతర్షి నీ
భవనాగ్రమ్మునఁ బ్రాఁతకాఁపు బుధ సంభావ్యంబు వాగ్దేవి తా
వివరింపంగఁ దొడఁగె నాంధ్ర కవితా విన్యాస మాధుర్య ధు
ర్య విచిత్రాయుత సంస్కృతుల నాఁడె! యెంతధన్యుండవో.

కమ్మఁదనమ్ము నీ మధుర కావ్యముసం జనితార్థమయ్యెఁ జి
త్తమ్ముల కెక్కఁ జేసెడి యథార్థము లీనెడి నీ నుడుల్ మహాం
ధ్రమ్మున నిండి జాలొ్కనియె మంజుల భావ పరంపరావళుల్
గ్రమ్మి దిగంతముల్ వెలిఁగెరా! కవిరాజ యఖండ దీప్తులన్.

సూతపురాణ మాంధ్రికి విశుద్ధ యశోమయ భూషణంబవై
చేతముఁ బ్రీతిఁ గూర్చెఁ దమ చేవ వెలార్చను బ్రహ్మ గీత వి
ఖ్యాతిని దెల్పు శంబుకవధాగత రాము కథా విధాన మీ
వే తపమాచరించి జనియించితివో! కవిరాజశేఖరా!

ప్రాఁత పురాణమా! యిది యబద్ధము క్రొత్త పురాణమన్ననో
రోఁత, మనూహ్య భావవిధులుం గరఁగించియుఁ బ్రాఁత క్రొత్తలం
బూతొక యింతలేని పరిపూర్ణ విశుద్ధ విమర్శనా యుతం
బై తగు సూత సంహిత సుమా యని చెప్పితివయ్య చౌదరీ!

బూజు పట్టిన ప్రాంత పోకడ లుదిమిట్టఁ
దుడిచి క్రొంగ్రొత్త పోకడలఁ గూర్చి

కుల మహోన్మాద శక్తుల యుక్తి వాదంపు
టుక్కుం బునాదుల ప్రక్కలించి

దైవ భక్త ప్రబుద్ధోద్దండ చండిమ డింపఁ
గలము ఖడము దాల్చి మలిచి నిలిచి

సంఘ సంస్కార వాస్తవిక దృష్టిని నిల్ప
ద్రావిడ వీర గాథల మధించి

కరుడు గట్టిన దాస్య శృంఖలలఁ ద్రెంచి
నూత్న చైతన్య మొసఁగి సంతుష్టిఁ గూర్చు
నీ ఋణమ్మెట్లు దీరునోయీ! కవీంద్ర
తతికి, శ్రీ రామసామి చౌదరి కవీంద్ర!

పొట్టకు బట్టకుం గడువఁబోవని సోమరి జాతి నామముల్
వెట్టుచుఁ జేయిసాఁచి పురవీథుల దేవుని పేరితోడ వా
కట్టెను, కర్మ ధర్మములకై బలి వెట్టెను శ్రామికాళి నం
చిట్టుల నీదు లేఖిని కవీ! నినదించెను దిగ్దిగంతముల్.

నిలువరించితివి నీతుల పేరితోఁ బంచ
జనుల బాధించు దుర్జాతిజనుల

కదపఁ జాలితి వార్య కవికుతంత్ర స్తంభ
ములు పెళ్లగిల్లి పాదులు సెడంగ

పారఁద్రోలితి దురాచార భూతము కేఁగి
మునిముట్టె నరసరమ్ములను నమల

ఉడికించితివి సత్యముడివోని దేశ భ
క్తుల మేనికండరమ్ములు గరంగ

జాతికై నీతికై భుక్తి జాలి విడిచి
యనురుసురుగాళ సంఘదాస్యమును బాప
దీక్షఁగొని కంకణమ్మూని తెరువు చూపు
యతివరా! భక్తితో నమస్కృతుల నిడుదు.

ఓ సూత్రాశ్రమ భూవిహార! భవదుద్యోగమ్ము నీడేర్చు దీ
క్షాసక్తిం గవిబ్రహ్మ కంకణము దాల్చఁగ్రమింగఁ గాలమ్ము మీ
తో సంపూర్ణత నందె నవ్యశకమిందుం జిల్ల వస్తాదు ల
త్యాసక్తి స్పందుముల్ బిగించి మహోద్యద్విక్రమ ప్రక్రియన్.

ఔను గాదని యెదురాడని యిల్లాండ్రు
ముప్పూఁట నీసేవ మునిఁగి యుండ

తండ్రి యానతి తలఁదాల్చి కిమ్మన నట్టి
కోవిదుల్ సుతులు నిం గొలిచి యుండ

భవదాజ్ఞకై చూపుఁ బఱపి చేతులుకట్టి
నేము మేమని నిల్చి మిత్రు లుండ

కనుసన్నతో నన్ని పనులు సేయఁగఁ జాలు
నాగర ప్రజలు వెన్నంటి యుండ

ఎలుక కొఱుకంగ గింజ నీ యింట లేని
యదనుసంద్రైన బెంగ నెమ్మదిని జొరదు
లోకమే నేను నేనె యీ లోకమంచుఁ
దలఁచి నిలిచితివయ్యా చౌదరికవీంద్ర.

ఆకల్పమ్మజరామరమ్ములగు కావ్యశ్రీల నాంధ్రావనిం
బ్రాకట్యంబుగ నిల్పిపోయిన కవీంద్రా ! ప్రేమకో మన్న మో
వాకంబుల్గాని సంఘుసంస్కృతులఁ గూర్పంజాలు ధీశక్తి ని
మ్మా ! కామ్యంబిది మాకు మీయెడల రామస్వామి కవ్యగ్రణీ!

ఆశయమ్మునకు నీరావేశమే కాని
మెడవంపఁగాఁ బోవు మేరునైన

సత్యమ్మునకు ఱొమ్ముచఱచి నిల్తువు కాని
జాతివిద్వేష మత్సరముఁ గొనవు

ధర్మమ్మునకు జీవితమ్ము నిచ్చుటే కాని
విపరీత వాదాల వెతుకఁ బోవు

సుగుణమ్ములకు నిజస్తుతిఁ దెల్పుటే కాని
నీకు వారని ముఖప్రీతిఁ బడవు

మనసు మాట యొక్క మాదిరి మనుగడ
వఱకు నడపుకొన్న వాఁడనీవు
మాంసభక్షణమ్ము మద్యపానము పర
స్త్రీపరాఙ్ముఖములు కావు నీకు.

ఏ సుముహూర్తమందు జనియించితివో యొకవత్సరమ్ము మీ
వాసముఁ జేరి నాకుఁ జదువంగలిగెన్ భవదీయశిష్యతన్
వాసిగడించితిన్ దెలుఁగునాట మహాద్భుతసంఘసంస్కృతిన్
జేసిన మీపదాబ్జములఁ జేర్చెద నా కవితాసుమమ్ములన్.

హూణ గీర్వాణాంధ్ర వాణీ మతల్లుల
కౌఁగిలి ముచ్చటలకు నోములు ఘటించి

ఆంధ్ర మహాసభాయాత సత్కవిరాజ
పూజ్య లాంఛనము సొమ్మున ధరించి

శతవధాన విధాన సార్వభౌమఖ్యాతి
తెలుఁగు దేశమున వర్ధిల్లఁ జేసి

బ్రిటను దేశమున బారిష్టరు పట్ట ప్ర
శంసలఁ బ్రథమ కక్ష్యలఁ దరించి

దయను బురపాలనాధిపత్యము వహించి
తిరి తెనాలికిఁ బెక్కువత్సరము లెలమి
స్వస్థలమ్మున గౌరవస్థానమంది
స్వస్థలాస్థాన కవివైతివా! కవీశ!

వాసియు వన్నెయుం దెలుఁగువానికిఁబాసి పరాయిబాసపై
నాసలు మోసుకొంత్తఁ దమయంబకు గోవను నంబ మూలమం
గాసట బీసటందగిలి కారియనందెడి వేళ జీవముం
బోసిన కీర్తిదక్కఁ గలముంగదలించితి వాంధ్రభాషలో.

ఆశయసిద్ధికై కలమునందు కవిత్వము వ్రాయువార లీ
దేశమునందుఁ గప్పడరు తియ్యము నెయ్యమొసర్పఁగూర్చు లా
వేశముతోడుగాఁ దెలుఁగు బిడ్డకు జడ్డునడంచి నిల్చితో
కేశికవీ! నమస్కృతి యిదే గొనుమా గను మాదరమ్మునన్.

పాడిఁ దొలంగఁబోవు కలచాఁడని మెచ్చుల నందఁబోవు మో
మోడవు చుట్టపక్కముల పొంతల వింతల నెంతొ చూప వా
వోడవు వచ్చు మేలు చెడునో యని జంకును గొంకఁబోని సీ
పోఁడిమి నేడఁజూడమని పొంగరె ముంగలఁ దెల్గుకైసరుల్.

# రామలింగారెడ్డి

భారత భాగవతాదుల జీర్ణించుకొని యందలి రత్నముల వంటి పద్యముల నాంధ్రుల కందించిన శ్రీ సుబ్రహ్మణ్యరెడ్డి గారి పుత్రులు. పుట్టిన దాది పట్టిన కలము భాషా సేవచేసిన మహాపురుషుఁడు కట్టమంచి రామలింగారెడ్డి. పాశ్చాత్య వాఙ్మయ మెల్ల జీర్ణించుకొని తత్ప్రభావమును దెలుఁగు బాసపైఁ బ్రసరింపఁ జేసినవారు.

మహోన్నతమగు రైతుజాతి కొక క్రొత్త వెలుఁగును జేకూర్చిరి. యువ కవుల కావేశము గల్పించి యూడదండయై నిలిచి నూతన మార్గముల ద్రొక్కు ధైర్యమును గల్పించిరి. 'ముసలమ్మ మరణము' మొదలగుపద్యకావ్యముల వ్రాయుటయే గాక యాంధ్ర సాహితీ రంగమున శక్తిగలిగి మఱుగుననున్న మహాకవి పింగళి సూరన్నను వెలికిఁదీసి యందలి మేలిమిని మన డెందములకు హత్తుకొనఁ జేసిన వారొక్క రెడ్డిగారే.

మెఱికలవంటి మాటలతో హృదయ ముచ్చుకొను పోవు మృదు విమర్శలఁ గావించుచు నిష్పాక్షిక విమర్శక శిరోమణియై వెలుఁగొందిరి. వీరి 'కవిత్వతత్త్వ విమర్శన' మజరామరమై నిలిచి తెలుఁగు తెగకు శాశ్వత సాహితీ భిక్ష పెట్టఁగలదు.

మును నిరాహారులందును నొక్కనికిఁ నైనఁ
దీసిపోవని వన్నెవాసిగల్గి

మును నేల నేలిపోయినవారి కిసుమంత
తఱుఁగని తీవి పెన్మెరువుగల్గి

మును గమికాండ్రు చూపిన బీరమునకుఁ ద
గ్గని మగంటిమి క్రొత్తదనముగల్గి

మును కయిూసరులు ద్రొక్కిన త్రోవలకుమించు
కమ్మకమ్మని వ్రాయసమ్ముగల్గి

నిక్కమునకెక్కి నెక్కొను చక్కనైన
పలుకులుం గల్గి కటమంచి కొలనునందుఁ
బుట్టి శ్రీరామలింగమక్షా పోలుపుఁగాంచి
కరము వెలుఁగొందితివి నా కుఁకరము వఱసి.

వాసికి వాసిఁగూర్పఁగలవాఁడవు రెడ్డివి వాసిరెడ్డి నే
చేసితి పెద్దగద్దె కభిషేకము బోధను నుగ్గుపాలలోఁ
బోసితి రంగరించి మన పూర్వచరిత్రలలోని యంశముల్
చేసినసేవ నేఁడిటు ఫలించెను మించెను రెడ్డిరాణ్మణీ !

మును వేమన్నకు నీకుఁ జుట్టఱిక మేమో బోధగాదయ్య పాం
దిన వెన్కం బరిహారముం బొనరిచె న్వేమన్న భోగాల నీ
జననం బాదిగ దేశసేవకయి భాషాసేవకై సర్వమ
ర్పణముం జేసిన నాసిఁగాంచితివి సుబ్రహ్మణ్యపుత్రాగ్రణీ !

కేవల కల్పనాకథలకే రస లుబ్ధజగమ్ము ముగ్ధమై
త్రోవలు దీర్చె బాణుఁడు, బుధుల్ మది నచ్చెరువంద నాంధ్రభా
షా వనితామతల్లికిఁ బసందుగ నూరన హారతిచ్చె, నీ
భావము సార్ద్రమై కరఁగి పాఱెను దీని కాంక్షలూరుచున్.

ఎవఁడీ భారతవాఙ్మయాంబునిధి జీర్ణింపంగఁ గ్రోలెన్ ఘటో
ద్భవు మించన్ వరసు రసార్య కవితాధారాసుధారాశి సం
భవ పీయూష రసానుభూతి పరుఁడే వాఁ డాంధ్ర మాంగల్య సూ
త్రవతీ పూజలఁ దృప్తుఁ జేయఁ డనఁ దాక్షిణ్యమ్ము నీవే కదా !

కదలని తారవై యుగయుగమ్ముల నిల్చెడి కట్టమంచి యో
హృదయము నాఁచికోఁడు జగదిద్ధచరిత్రుల నామపంక్తిలో
మొదలఁడు సాహితీ రస సమీక్షకు బంగరు గంటమందునన్
ముదురుఁ దనంబు గాంచఁడు మనోహరరీతులఁ దెల్గువాణికిన్.

తిరుపతి వేంకటేశ్వరుఁడు దీకొన మార్కొని కావ్యచర్చలో
మెఱుఁగులు దీర్చిదిద్దఁగల మేటివి లోకములెల్ల నెత్తినన్
బిరుదుమగండవై నిజమునిల్ప నపస్మృతిదుల్ప మెల్పుతో
బరిపయిఁ గాలు ద్రువ్వఁగల వాఁడవు నీ వాకరుండవేకదా !

చర్చించెనా యహింసామూర్తి బుద్ధుండు
దానవై విశ్వవిద్యాలయమును

అభిషేక మొనరించెనా యోగి వేమన
వెలలేని నీ త్యాగ విభవమునకు

నిలువెల్లఁ బుల్కరింతలు వెట్టెనా కవి
రాజు కన్గొని జాతి రత్నమనుచు

రచియించెనా పద్యరత్నముల్ వేంకట
నరసయ్య సాహితీ నాథ యనుచు

జయజయేతి ధ్వనుల్ మిన్ను చఱవ భేరి
నఱుమఁ బ్రచురించెనా కృష్ణ ధరణి ధవుఁడు
సాటి రాజవటంచు స్వాఖ్యాతి కందుఁ
బరమ పరిపూర్ణ దివ్య తత్త్వమును జేర.

# వేంకటనరసయ్య

నిఘంటువులలో కెక్కని నిత్యము సామాన్య రైతు కుటుంబములో వాడుకొను పదజాలము నింతగా నుపయోగించు జాతీయతగల కవులు మఱెవ్వరు లేరు. తెలుఁగు వెల్గులకుఁగా నిలువెల్లను ధారవోసితినని ధైర్యముగాఁ జాటుకొన్నారు.

బహుళ ప్రబంధ నిర్మాతయై సాహిత్య నిధియై యుండియు పలుకుబడి సొంపుల వర్ణించు పట్ల స్వల్పపు నియమముల నుల్లంఘించుటకు వెనుకాడరు. ఆంధ్రుల కొక మహా పురాణమును నిర్మింప నుమకట్టి వీరభారత మను పలనాటి చరిత్రమును ప్రారంభించి, యాంధ్రుల దురదృష్టవశమున, ముగియకమునుపే పరమపదించిరి. కవిబ్రహ్మ తిక్కన యుత్తరదేశ నివాసినియగు ద్రౌపదిని దిద్దితీర్చ నీకవిబ్రహ్మ - ఏటుకూరి వేంకటనరసయ్య తెలుఁగు పడఁతియైన మగువ మాంచాలను దత్తుల్కగా నంతకంటెఁ గొంచెము మెఱుఁగొనరించి యాంధ్రతా ముద్రను సంపూర్ణముగా వెలయించెను. ఈ మహాకవి పేరితో నొక సాహిత్యమండలి సంస్థాపింపఁబడినది-అందేఁటేఁట నీకవిబ్రహ్మ నామముతో నొక కవిని సమ్మానించుచుందురు.

పలికిన పల్కులో నమృతభావము చిందెడి నీదు లేఖనిం
జిలికిన వీరభారత విశేషకథామృతమాని యాంధ్రభూ
తల మజరామరత్వముల ధన్యతఁగాంచెఁ గవీంద్రచంద్ర మా
తెలుఁగుఁ దనంపుఁదీపి జిగి తేజము వెల్వడె నేఁడు సత్కవీ!

కలము హలమ్ముఁబట్టిన జగాన మొనగాఁడవు సత్కవీంద్ర నీ
వలపలి చేతిగంటమున వాక్కునఁ బావనమయ్యెఁ దెల్గు నీ
పలుకొక సూత్రమై వెలయు వ్యాకృతి కెల్లెడ నీవు మాపు త్రో
వలఁ జరియింపఁగాఁగలరు భావికవీంద్రులు సద్గురూత్తమా!

తెలుఁగుంజోదుల శౌర్యధైర్యములఁ గుస్తీపట్టులం దెల్పు ప
ట్టుల మీకెవ్వఁడు సాటి పొట్టకయి యొట్లో చిట్టిపాత్రమ్ములన్
గెలుకంజూడ నెడందపైఁ గరము నెంకేయుంచి వీక్షించినం
దెలియంబోలదె యాంధ్రవాఙ్మయము నుద్ధీకించునో యేరిచే.

తనువెల్లం బులకించిపోయినది యాంధ్రత్వమ్ము సుంతేని క
ల్గిన ప్రాజ్ఞాళికిఁ గైతతీవె పువులం గీరించి వాగ్దేవి పూ
జనముం జేసిన ధన్యజీవివి భవత్సాహిత్యసమ్మాన మాం
ధ్రిని బూజించి నివాళియిచ్చుటలు గాదే! విద్వదాఖండలా.



ముద్దుముద్దుగ సుమమ్ములు విప్పి యొప్పారె
సరసులు నీతిమంజరులఁ దనియ

జాతీయభావ బీజములెల్లఁ జెల్లుబ్బి
జీవనమ్మిడఁ బండె క్షేత్రలక్ష్మి

ప్రతిశ్రేణి మోక్షసామ్రాజ్య సాధమునకు
దాఁటిసినది సిద్ధాశ్రమమ్ము

తెల్గుదేశప్రశస్తిని దిగ్దిగంతాల
వీరభారత కథల్ విజ్జరాల్చె

కృష్ణరాయలు మూర్తి మూర్తీభవించి
ప్రతిఫలించిరి రాణి రుద్రమచరిత్ర
వలచి వలపించినది కవిబ్రహ్మ వాణి
తెలుఁగుపొలమున నీకు నుద్దియునుగలఁడె.

ప్రాచీనాంధ్రుల శౌర్యధైర్యములఁ దెల్పంజాలు పల్నాడు, ధా
త్రీచక్రమ్ము నదల్చి నిల్చి మతవిద్వేషాగ్నికిన్ మ్రగ్గు గా
థాచాతుర్యము జీవసిద్ధి కవిచంద్రా! కాంచె నీగంటమం
దాచంద్రార్కము తెల్గువెల్గులిడునయ్యా! నీ మహాకావ్యముల్.

కలదిఁక దాక్షిణాత్యుల కఖండచరిత్రయటంచు నాంధ్రులుం
దలఁచెద రౌత్తరాహుల కథల్ మదికింపవు ముందు మోళ్ళరోఁ
కళులఁ బ్రతిధ్వనించు మృదుకావ్యకళామయ బ్రహ్మగీతికల్
నిలుచు నజాండభాండముల నిండుచు నారవి తారకంబుగన్.

ఇది యొకఁడేల తెల్గునఁ గవీశ్వరుఁడైన భవత్పదాబ్జముల్
మదిఁబదిలంబుఁజేసి కుసుమంబులఁ బూజయొనర్పఁడే భవ
త్పదములముట్టి నవ్యకవితాధుని మజ్జనమాచరింపరే
సదయులు సత్కవీంద్రులు విశాంపతులుం గవితాకళానిధీ !

కసివోకన్ మసిపూసికొన్నఁ దులఁదూఁగన్వత్తురా నవ్యకా
వ్య సమారంభ విశిష్టశిష్టజన సంభావ్యంబుగాఁ గూర్ప! మీ
రసవత్కావ్యము లాంధ్రవీరులకు దీర్ఘాయుష్యముంబోసె నాం
ధ్ర సతీమస్తకరత్నదీప్తి గురువర్యా ! మీ వచోగుంభనల్.

మామా! నీ మృతి యాంధ్రఖండమునకే మాయింపఁగారాని మ
చ్చై మా మానస్వధులంగలచె నబ్బా! పాడుదైవమ్ము నీ
క్షేమంబుంగని యోర్వలేక దిగమ్రింగెన్ దేశిసాహిత్య దే
వీమాంగళ్య చిరత్నరత్నములఁ గప్పెం గాల ధూమావళుల్.

# తిరుపతి వేంకటేశ్వరులు

జీవితాంతము కలిసి రచనల సాగించుచు నాంధ్ర దేశమున మూలమూలల నున్న గ్రామములలో సైత మవధానముల రుచిఁజూపించి ప్రతి యాంధ్రుని హృదయమునఁ గవితాబీజముల నాటినవారు తిరుపతి కవులు. కాలమానములు వీరి యదృష్టమునకు వన్నె వెట్ట యశోధనముల నార్జించిరి.

శాఖాభేదములు ప్రళయతాండవ మొనర్చి వాగ్యుద్ధములు కవితా రీతులతో సాగి కొంత యవినీతిని వెల్లడించినను నాఁటి పత్రికలు రచయితల హృదయము లీ దుమారమున మునిఁగి చవుకబారు కవితా రసధారలఁ గొంత శాంతి నందు చుండెడివి. ఇది యొక విప్లవముగా రేఁగి నోఁట నోఁట యీ విషయములే నానెడివి.

పౌరాణిక కావ్య యుగము లంతరించు సమయమునఁ దమ కవితా విలాసముల బండిత సభలలోను కవి సమాజములను రాజుల "దర్బారు" లలోను వెలలించి యఖండ సన్మానములందిరి. శిష్యులఁ దమంత వారినిగా దిద్దితీర్చిన ఖ్యాతి యాంధ్ర కవులలో వీరికి మాత్రమే దక్కినది. పలురకములైన రచనలలో వీరి గంటము లాంధ్రుల నాల్గూర లూఁపినవి.

తిరుపతి వేంకటేశ్వర సుధీవరులార! మహాంధ్రమండలిం
దిరిగి జయేందిరంగని యథేచ్ఛ విహారమొనర్చి రాజమం
దిరముల పాద శింజిత మణీవలయాభరణాంక ముద్రికాం
బర పరివేష్టనాది బహుమానము లందితి రీశు సత్కృపన్.

చూడని రాజులేఁడు చవిచూడని కావ్యరసమ్ము లేదు మీ
వాడని శబ్దజాలములు వాఙ్మయవీథులఁ బుట్టలేదు వా
దాడి జయించిపోయిన మహామహుఁడొక్కఁడు లేఁడు మీనుడుల్
కోడయికూసి మేల్కొలుపులుం బచరించెఁ దెలుంగువారికిన్.

గురులని మిమ్ము భక్తిమెయిఁ గొల్చి భవత్పద పాంసులేశమున్
శిరమునఁ జేర్చి సత్కవితఁ జెప్పెద రద్యత నాంధ్రసత్కవీ
శ్వరు లవధానవేళల సభాముఖమందొకసారి ధ్యానత
త్పరత మిముందలంచి యవధాన మొనర్తురు గెల్పునందఁగన్.

వెలనాటి వాఁడఁ గవితకు
వెలనాటిన వాఁడ ననుచు వివరించె మహాం
ధ్రుల నోముపంట తిర్పతి
గులకుం దిగినాఁడు వేంకటేశ్వర కవి[illegible].

# శ్రీ రాములు

దేశమునందలి సమస్యలఁ దీర్పఁ బలువు రుపవసించిరి. ఐన నా సమస్యలఁ బూర్తిగాఁ బరిష్కరింపకయే "రాజీ"కిఁ దొడఁగిరి. కానిపొట్టి శ్రీ రాములు కొఁబట్టినపట్టు వీడక యెవ్వరెన్ని చెప్పి విరమింప యత్నించినను వినక సంపూర్ణమైన నైతిక బలముతో నుపవాస దీక్షను గొనసాగించిన జాతీయ యోధుఁడు. మరణించి పైలోకమందుండియైన వీక్షించెదనని యమృతవాణిని బల్కిన నిర్మల హృదయుఁడు.

ఆంధ్ర నాయకుల సమైక్యమునకుఁ బ్రయత్నించి విఫలుఁడై యీ కార్యమునకుఁ గడఁగెను. నేటి నాయకుల వీరికి పరిపోల్చుట మహాపచారమైనను పూర్వ కావ్య వాఙ్మయమందలి పురుషోత్తములు సైతము తౌల్యమందుట కష్టతమము.

నలువది యేండ్లు దాఁటి చనినన్ మన రాష్ట్రము రాదటంచు నాం
ధ్రులకు ననేకతం దొలఁగఁ ద్రోయఁగ దుర్ఘటమంచు నాయకుల్
కలియక సొంత లాభములకై మెడ సాఁతు రటంచుఁ బొట్టి రా
ములు విసుఁగెత్తి యామరణ ..ంగొనె దీక్షను నిర్వికారుఁడై.

పుట్టు వొందెను లాభమును గోరి ధర్మ దీ
క్షను బూను వైశ్య వంశమ్ము నందు

వాసించె మదరాసు లో సమున్నిద్రమై
వెలయు నణ్ణాపిళ్ళె వీధియందు

చదువ నేర్చెను బరీక్షలలోన మున్ముందు
జయమందఁగాఁ బాఠశాలయందు

నిలిచెఁబో బీదపాదులు మెచ్చి యర్పింపఁ
దులలేని "రైల్వే" యుద్యోగమందు

సత్యమును ధర్మమును నహింసయును మూఁడు
మూర్తులై లీనమయ్యె నీ పుణ్యు నందు
తెలుఁగు వెలుఁగులు దిగ్దిగ్దిక్కుల వెలింగ
రత్నగర్భాఖ్య భువికి సార్థకతఁ జెందె.

భారతీయుని గౌరవమ్ము వమ్మాయె
దోరింపఁబడ్డ నీకో నేలఁగూలి

తెనుఁగు చేవయుఁ దెన్గు తీవ్రత తెనుఁగు
ఘనత నీతోఁబాటు గంగపాలాయె

అతి పవిత్రాశయా లాటిపోయినవి
సత మధికార వాంఛలు మిన్నుఁ దన్నె

కాదన్న దానన్న కలహమ్ము రేఁగి
వాదోప వాదాల వారు మెండైరి

తల్లియే గతి దీనదశకు వచ్చినను
పిల్లపాలకు నేడిపించుఁ దీండ్రించి

లోకమ్ముఁ దనచూపులో నిల్పు నొకఁడు
నాకేది మేలని ననుకాడు నొకఁడు

ప్రాణాల బలియిచ్చి పోరాడు నొకఁడు
దానమ్మునకుఁ దహ తహలాడు నొకఁడు

నర నరమ్ముల రక్తనాళాలు పొంగి
బురదయై వరదయై పదును జేకూర్చె

కదలిరా రండోయి కదలిరా రండు
అదనులో విత్తనా లదికింపఁబండు

కార్యాన ఖడ్గాన గడిదేఱి మీఱి
ధైర్య శౌర్యాల నాంధ్రత్వమ్ము చూపు

డుపవాస గౌరవ మ్మూడిపోయినది
రెప రెప చేసి మాఱినవారితోడ

అని తెల్పు మనకు రామనజీవితమ్ము
కని కల్ల నిజములఁ గాంచుఁడీ మీరు.

తన సర్వస్వము ధారవోసి మును స్వాతంత్ర్యమ్ము బాపూజి తె
చ్చెను, ప్రాణమ్ముపణమ్ముగానిడుచుఁ దెచ్చెన్ రాష్ట్రముంబొట్టిరా
మన, వీ రిర్వురు దేశరాష్ట్రముల కయ్యల్ బంగరుం బూలఁ బూ
జనముం జేసిబుణమ్ముఁదీర్చుకొనుఁడాచంద్రార్క—ముద్యన్మతుల్.

ఆయము పాయముం దొలఁగి ఘయ్యలు పీఠము లాక్రమింప నా
రాయణ చెప్పరాని వినరాని దురాయులఁ జేదు మేసి రా
తీయసి నోట నాఁడు వెనుదీయక నీ వది చూచి ప్రాణముం
బాయఁ గడంగి నాఁడవు ప్రపంచము సాక్ష్యము గాక పోవునే.

నీ నిర్మాణ పథావలోకనము గాంధీతాత గాంక్షించి యత్యానందంబును జెంది రత్నమని రామన్నా! వచించెంగదా తానె తందన తానె తానె యని వంతాలాడు నీ మాటతోఁ బ్రాణంబుల్ విసుఁగెత్తి యామరణ దీక్షారంభముం బూనితే.

నన్నయాదుల కన్ను విన్నవైయున్న దో
షము వాని దేయంచు సరకుఁగొనవు

వేములవాడ భీమామాత్యుఁ జేమన్నఁ
గన్నెఱ్ఱఁగాఁ బోదు కలికమునకు

మర్యాద రామధీమణి చరిత్రంబందుఁ
బడఁదిట్టఁ గిమ్మని పలుకఁబోవు

చింతామణిన్ సుబ్బిసెట్టి వేసముఁ గన్నఁ
గినియఁగాఁబోవు నికృష్టబుద్ధి

ధర్మసత్రాలకెల్లఁ జండాలనిచ్చి
మేపెదవు మేలు గీళ్ళ హామికయొసంగి
కాచెదవు తాల్మివీడని కనికరమ్ము
నరనరమ్ముల నీకు జీర్ణమ్మునందె.

మాసిపోఁబోదు నీ వాసి దిగ్గజ దంత
సరణిపై వెన్నెల జల్లులగుచు

చెఱఁగిపోఁబోదు చేసిన సేవ చారిత్ర
కాగ్రణుల్ వ్రాయు వ్రాయసములందు

కాంతిహీనముగాదు కడముట్ట నుపవాస
దీక్షఁగైకొన్న నీ దివ్యశక్తి

సమసిపోఁబోదు సౌఖ్యమును దుఃఖము నొక్క
రేవులోఁ గలిపి ఘూర్ణిలిన దినము

ఆశయమటన్న జైజై యటంచుఁగాని
వేయిరాష్ట్రాలు నీయంత విలువరావు
పొట్టిశ్రీరామ నీవంటిదిట్ట యాంధ్ర
సోదరుండన్న భాగ్యమ్ముఁ జూడఁగలమె.

సూనృతమూఁది నీతికిఁ గుసుంభుఁడు కన్నకుమారితోడ దా
వానలమందు దూఁకెను నిజాన్వయమెల్లను వెంటనంటె వం
శానఁ బరంపరాగతము సాగుచునున్నది ధర్మబద్ధమై
దీనజగంబు మేల్కొని నుతించుత మిమ్మనిశమ్ము భక్తిమై.

కంపిల్లినవి ఢిల్లి కార్యాలయమ్ములు
పచ్చిగోడలు బీట వాటినట్లు

జంపిల్లినవి పెనురాజువుల్ చేయెత్తి
జయ జయోతిధ్వాన సంభృతముగ

దద్దరిల్లినవి కేంద్ర ప్రధానుల చేత
గుండియల్ గుభ్భుకోల్కొని తపించి

మూర్ఛిల్లినవి జడమ్ములు గూడ శ్రీరామ
రామ రామని నిర్విరామముగను

జాతిపితవోవు నాటి విచారమెల్ల
నగుపడియెఁ జూడఁజూడ ప్రత్యణువునందు
రాష్ట్రపిత వైన నీవు స్వర్గమును చేరఁ
బొట్టి శ్రీరామ! నీవెంత దిట్టవోయి.

నూటికి నూటఁబాళ్ళు తమ నోఁచిననోము ఫలించినంతనే
బాటలు దీర్చిదిద్దుకొని బాగయి రాంధ్రులలోనఁ గొందఱీ
మాటకు నట్టువంచ కభిమానము నూనముగాక నిల్చితే
పూఁటకు గంజిలేక కడుపుంబిగఁబట్టి యశోధనాగ్రణీ!

ఆఱిపోయినది దివ్యజ్యోతి చీకటి
జేరసారములు విస్తారమగును

సమసిపోయినది యాంశాజ్యోతి మాలల
నంటరానితనమ్ము వెంటనంటు

మలిగిపోయినది ధర్మజ్యోతి యవినీతి
చెలరేఁగి సివమెక్కి చిందుద్రొక్కు

రాలిపోయినది రాష్ట్రజ్యోతి యెల్లలు
కుదియించుకొని కొట్టుకొనకు వచ్చు

పాలకులు పాలితుల రక్తనాళములను
మూలుగుల గుజ్జుఁబీల్చి త్రేఁపుదురు ముందు
నిలిచి యాపెడు మొనగాఁడు తెలుఁగునేలఁ
బుట్టునో లేదో మున్ముందు పొట్టిరాము.

వందలు వేలు జీతములు వచ్చిన మేఁతలుమేసినన్ సుఖం
బందక మందభాగ్యు లశియాసల గాలము వెళ్ళఁబుచ్చఁగాఁ
గందక గాజువాఱిక సుఖమ్ముగ ముప్పది రూకలంది నీ
వందితివోయి తృప్తి యిదియాగద నీతికి మూల మియ్యెడన్.

మున్ను దధీచినో శిబినొ మూఁదల యిత్తునటన్న వారు కా
వ్యోన్నతిఁ గన్నవార లదియున్ సరికాదనియన్న హింసకై
వెన్నును దూఁచి మాంసమును వేసిరి నీవలె శాంతికై మెయిం
గన్నఱలేక యిచ్చు మొనగాఁ డెవఁడోయి యఖండభారతిన్.

BCL

## ఇ త ర కృ తు లు

| | | |
|---|---|---|
| 1 కర్షకా! | ... | 0–8–0 |
| 2 భావనారాయణ చరిత్రము | ... | 1–0–0 |
| 3 భావలింగశతకం (పరిష్కర్త) | ... | 0-4–0 |
| 4 నెహ్రూ చరిత్ర (పద్యము) | ... | 5–0–0 |
| 5 దివ్యస్మృతులు | ... | 1-8-0 |

ప్రతులకు:

కవిరాజ గ్రంథమాల

పొన్నూరు.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | 0 |
| పుస్తకం పేరు | దివ్యస్మృతులు |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 105 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | vii |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Navya |
| పేజీలు విడదీసినది | Thahir |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |